శ్రీరామాయ నమః

శ్రీమద్వాల్మీకిమహర్షి ప్రణీత

# శ్రీమద్రామాయణము

# యుద్ధకాండము

మొదటి సంపుటము



ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు రచించిన
బాలానందినీ వ్యాఖ్యతో కూడినది.

ప్రచురణ

ఆర్ష విజ్ఞాన ట్రస్టు

హైదరాబాదు

1995

ప్రథమ ముద్రణ - యువ శ్రీరామనవమీ (9.4.1995)

ప్రతులు - 2000



ప్రతులకు:

శ్రీ పమిడిఘంటం శ్రీరఘురామ్,
శ్రీరామసదనము, ప్లాట్ నం. 1361, రోడ్ నం.45
జూబ్లీ హిల్సు కో-ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ,
హైదరాబాదు-500 034.

ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు,
నందనం, 7-1-32/4, ప్లాట్ నం.2
బేగంపేట, హైదరాబాదు-500 016.

మూల్యము: రూ.80.00

Laser Typesetting by
Prasad Graphics,
Himayatnagar,
Hyderabad-29.

Processed & Printed at
Kalanjali Graphics,
Narayanaguda,
Hyderabad-29.

# ట్రస్టు బోర్డు సభ్యులు



ఆర్ష విజ్ఞాన ట్రస్టు
శ్రీరామ సదనము
ప్లాట్ నం.1361, రోడ్ నం.45
జూబ్లీ హిల్స్ కో-ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ
హైదరాబాదు-500 034

# భద్రాచల శ్రీ సీతారామలక్ష్మణులు



వామాంకస్థిత జానకీ పరిలసత్ కోదండదండం కరే
చక్రం చోర్ధ్వకరేణ బాహుయుగళే శంఖం శరం దక్షిణే,
బిభ్రాణం జలజాతపత్రనయనం భద్రాద్రిమూర్ధ్ని స్థితం
కేయూరాదివిభూషితం రఘుపతిం సౌమిత్రియుక్తం భజే.

# అక్షరాంజలి

'శ్రీరామ' అని వ్రాసి మొదలుపెడతారు పద్యమైనా, పద్దుపుస్తకమైనా తెలుగునాట. ఇప్పు డీ సంప్రదాయం క్రమంగా అంతరిస్తున్నది గాని, నిన్న మొన్నటిదాకా పల్లెల్లో నేమి, పట్టణాలలో నేమి అలాగ శ్రీకారం చుట్టనివారు అరుదు. రామభక్తిసామ్రాజ్యంలో ఆంధ్రదేశానిదే అగ్రస్థానం. తెలుగునాట భద్రాచలంపై కొలువుదీరిన సీతాలక్ష్మణసమేత శ్రీరామచంద్రుడు, రామదాసైన కంచర్ల గోపన్న పుణ్యాన, లోకప్రసిద్ధుడైనాడు. ఒకవిధంగా అయోధ్యకు లేని విశిష్టత భద్రాద్రికి ఉంది. భద్రగిరి దాశరథి చతుర్భుజుడు. అందుచేత ఆయన రామనారాయణుడు. రామనామం చేసేవారు, రామకోటి వ్రాసేవారు, రామభజనల్లో పాల్గొనేవారు మన తెలుగువారిలో ఉన్నంతమంది మరే భాషావర్గంలోనూ లేరేమో. మనలో ఎందరో రామన్నలు; మరెందరో రామయ్యలు.

ఏమిడి ఘంటం వంశంలోనూ ఇరవయ్యో శతాబ్ది రెండవపాదం ఆరంభంలో జన్మించిన ఒక కోదండరామయ్యకు రామయ్యమీద ఎనలేని భక్తి. అందులోనూ భద్రగిరి దాశరథిమీద మక్కువ ఎక్కువ. రామభక్తి ఆయన దృష్టిని రామాయణంమీదకు మళ్లించింది. అది గాఢమైన అభిమానానికి దారితీసింది. తెలుగులో దొరికిన రామాయణాలు చదివారు. వాల్మీకి రామాయణం చదివితే ఇంకెంత రసభరితంగా ఉంటుందో అనిపించింది. అనిపించినదే తడవుగా అదీ చదివారు. రామాయణ దివ్యలక్షణాలు ఆయన ఎదుట ఆవిష్కృతమైనాయి. ఇప్పు డాయనకు రామాయణపారాయణం అలవాటు.

ప్రచురిత రామాయణ ప్రతులలో ఎన్నో పాఠాంతరాలు ఉన్నాయి. కథా గమనంలో తేడాలు ఉన్నాయి. పాత్రల ప్రాముఖ్యంలోనూ వ్యత్యాసాలు ఉన్నాయి. ఒకానొక రామాయణంలో రావణుడు దశకంఠుడు కాదు, సహస్రకంఠుడు. ఇంత వైవిధ్యం కలిగిన రామాయణాలలో దేని సారస్యం దానికి ఉన్నప్పటికీ, వాల్మీకి రచించిన మూలానికి ఒక ప్రత్యేకత, ఒక గౌరవస్థానం ఎప్పుడూ అలా ఉంటూనే ఉంది. వాల్మీకిరామాయణాన్ని టీకాతాత్పర్యవిశేషవ్యాఖ్యలతో తెలుగులిపిలో మూలంతో సహా ప్రచురిస్తే అది ఆంధ్రులకు ఎంతో ఉపయోగపడుతుందని కోదండరామయ్యగారికి సంకల్పం కలిగింది. తొలుత న్యాయవాదిగానూ, తరువాత న్యాయమూర్తిగానూ కోదండరామయ్యగారు లబ్ధప్రతిష్ఠులు. రామాయణం సామాజిక విలువలను కాపాడుతుందని, ధర్మసంరక్షణం కావిస్తుందని ఆయన

విశ్వాసం. వృత్తిరీత్యా ఆయన గడించిన అపారమైన అనుభవం ఆయన విశ్వాసాన్ని సుదృఢం చేసి ఉంటుంది. "ఏష ధర్మః సనాతనః" అంటూ రామాయణం పలికిన ధర్మాలు సార్వకాలికమైనవి. భార్యాభర్తలు పరస్పరం అనురాగబద్ధులై ఉండాలనీ, పిల్లలు తల్లిదండ్రులమాట వినాలనీ, పరస్త్రీని చెరపట్టడం వినాశహేతువనీ, పాలకులు ప్రజల అభిప్రాయాలకు స్పందించాలనీ బోధిస్తున్న రామాయణంలో ఎవరికైనా మంచి కనిపించకుండా ఎలా ఉంటుంది? ఎవరైనా రామాయణంలో మంచి లేదంటే అందుకు కారణం వారు రామాయణాన్ని సరిగా చదవకపోవడమైనా అయుంటుంది. చదివితే అర్థం కాకపోవడమైనా అయుంటుంది. చదివీ, అర్థం చేసుకొనీ అటు తరువాత కూడా అందులో ఏమీ లేదనిగాని, అది ఆక్షేపణీయగ్రంథమని గాని ఎవరైనా వాదిస్తే అలాంటివారికి నమస్కారమనడం తప్పించి చేయగలిగింది లేదు. అదేమైనప్పటికీ, వాల్మీకిరామాయణంలో అన్ని శ్లోకాలకు అర్థతాత్పర్యాలను, అవసరమైన సందర్భాలలో వ్యాఖ్యానాన్ని, వివరణను ఇవ్వడం లోకోపకారకమవుతుందని విశ్వసించిన కోదండరామయ్యగారు తమ సంకల్పానికి కార్యరూపం ఇవ్వడం కోసం ఒక "ట్రస్టు"ను స్థాపించారు. ట్రస్టుకు శ్రీ నీలంరాజు వెంకటశేషయ్య అధ్యక్షులు. శ్రీ దేవులపల్లి రామానుజరావు, శ్రీ ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి, డాక్టర్ వి. శాంతారామ్ సభ్యులు. డాక్టర్ ముక్తినూతలపాటి గురునాథ్ (విజయవాడ) కోశాధ్యక్షులు. శ్రీ పమిడిఘంటం శ్రీరఘురామ్ కార్యదర్శి. ట్రస్టు ఏర్పడిన ముహూర్తబలమో, కోదండరామయ్యగారు సమకూర్చిన మూలనిధి పుణ్యమో, అన్నింటికి మించి రామాయణమహిమో ఏది కారణమోగాని ట్రస్టుకు ఎన్నడూ ఊహించని వర్గాలనుంచి సైతం సహాయసహకారాలు లభించాయి. పేరు చెప్పడానికి కూడా ఇష్టపడని ఒక ముస్లిం సోదరుడు తనంతట తానుగా ట్రస్టునిధికి పాతికవేల రూపాయలను జమకట్టారు. మరెందరో ఇలాగే ముందుకు వచ్చి ప్రచురణకు తోడ్పడ్డారు. కంచి కామకోటి పీఠాధిపతి జగద్గురు శ్రీ శంకరాచార్య స్వామివారు ఆశీస్సులు అందించి, ప్రచురణను ప్రోత్సహించారు. "శ్రీమద్రామాయణములో ధర్మమూ, మాతృభక్తి, పితృభక్తి, ఆచార్యభక్తి, పతిభక్తి, సహోదరప్రేమ, ఆపత్కాలములో సంరక్షణ, ఇటువంటి అనేకధర్మసూక్ష్మములు చెప్పబడినవి" అని జగద్గురువులు తమ సందేశంలో రామాయణప్రాశస్త్యాన్ని వివరించారు.

శ్రీకోదండరామయ్యగారి సంకల్పబలాన్ని కంచిస్వామి ఆశీస్సులు ఇనుమడింపజేసి శ్రీమద్రామాయణ ప్రచురణ కార్యక్రమం త్వరలోనే ఊపందుకొన్నది. బాలకాండము, అయోధ్యాకాండము రెండు సంపుటాలు, అరణ్య- కిష్కింధా-సుందరకాండముల ముద్రణ పూర్తయి, ఇప్పుడు యుద్ధకాండము కూడా పూర్తయింది. "శ్రీరాముని దయచేతను" ఒక మహాకార్యం ముగిసిందని మురిసిపోయారు ట్రస్టు వ్యవస్థాపకులు. కోదండరామయ్యగారిమీద శ్రీరాముడి కారుణ్యకిరణాలు

ప్రసరించడం ఎంతమాత్రం విశేషం కాదు. ఆయన తాత ముత్తాతల కాలం నుంచి పమిడిఘంటంవారు రాముడిని కొలుస్తూనే ఉన్నారు. రాముడు వారిని అనుగ్రహిస్తూనే ఉన్నాడు. నాలుగైదు వందల సంవత్సరాల చరిత్ర తిరగేస్తే ఈ వంశంలో దైవభక్తీ, సారస్వతసేవా రెండూ కనిపిస్తాయి. ప్రౌఢ దేవరాయల కాలంలో అబ్బమంత్రి ఒక గొప్ప వ్రాయసకాడు. ఆయన వ్రాతను మెచ్చి ప్రౌఢరాయలు ఆయనకు ఒక బంగారపు గంటాన్ని బహూకరించాడు. గంటంతో రాయడం అప్పట్లో ఒక గొప్ప కళ. రాయల వారినుంచి గంటాన్ని బహుమతిగా అందుకొన్నప్పటినుంచి అబ్బమంత్రి వంశీకులు "పైడిగంటము" వారైనారు. అంతవరకు ఈ వంశీయుల ఇంటిపేరు తామరపల్లె. "శేషధర్మములు" కావ్యంలో తామరపల్లె తిమ్మయ్యకవి వ్రాసిన ఒక పద్యం ఈ విశేషాన్ని తెలియజేస్తున్నది. (భారతి 1946 ఆగస్టు సంచికలో శ్రీ కీర్తి కామేశ్వరరావుగారి వ్యాసం).

"గీ. ప్రౌఢరాయల మెప్పించి రాయసములు
పైడిగంటంబు గొని వ్రాసి భద్రలీల
బైడిగంటమువా రను పద్దు దెచ్చి
యలరె మీ తాత ముత్తాత యబ్బమంత్రి."

తామరపల్లె ఇంటిపేరు కలిగిన కొందరు మాత్రం అదే ఇంటిపేరును కొనసాగించుకొని ఉంటారు. అబ్బమంత్రి సంతతిమాత్రం "పైడిగంటం"ను తమ ఇంటిపేరు కావించుకొన్నారు. ఎవరితరంలోనో "పైడిగంటం" పమిడిఘంటంగా మారింది. కోదండరామయ్యగారికి నాలుగైదు తరాల ముందువారైన పమిడిఘంటం వెంకటరమణ హరిదాసుగారు భద్రాచలంలో ఒక సత్రం కట్టించి, యాత్రికులకు అన్నదానం చేస్తుండేవారు. రామభక్తులకు సేవ చేయడమూ రాముడికి సేవచేసుకోవడమే అవుతుంది. దాసుగారు కట్టించిన సత్రం అంబసత్రంగా ప్రసిద్ధిగాంచింది. తవ్వెడు బియ్యం ఉడకేసి పెట్టడంతో మొదలైన అన్నదానం గుండిగలకు గుండిగల వంటగా వృద్ధి చెందింది. అది రాముని దయ అని దాసుగారు నమ్మారు. దాసుగారిని సీతారామలక్ష్మణులు కనిపెట్టి ఉండేవారని జనశ్రుతి. ఒకానొక శ్రీరామనవమి పర్వదినాన అంబసత్రంలో ఎప్పుడూ వచ్చే వంటవాళ్లు రాకపోవటంవల్ల దాసుగారు ఆందోళనపడి కూర్చున్నారట. ఇంతలో ఇద్దరు అపరిచితులు వచ్చి తాము వంటచేసిపెడతామని సంసిద్ధత తెలియజేశారట. దాసుగారు బ్రహ్మానందపడి వారిచేత వంట చేయించారట. దివ్యంగా వంట పూర్తయింది. కాని, వంట చేసిన వాళ్ళిద్దరూ మాత్రం స్నానం చేసి వస్తామని వెళ్ళి తిరిగి రాలేదట. అలా అయాచితంగా వచ్చి వంట చేసిన ఇద్దరూ రామలక్ష్మణులే నని గాథ. రెండు సోలల బియ్యం వండితే పాతికమందికి

సరిపోవడం లాంటి మరెన్నో గాథలు అంబసత్రం విషయంలో వినిపిస్తుంటాయి. అప్పట్లో రామలక్ష్మణులు వండిన రెండు గుండిగలు ఇటీవలవరకు సత్రంలో ఉండేవి. వాటిని రామలక్ష్మణుల గుండిగలనే పిలిచేవారు. వెంకటరమణదాసుగారి పినతండ్రి శ్రీ ఆదినారాయణదాసు గొప్ప రామభక్తులు, వాగ్గేయకారులు. వారు మద్రాసునగరంలోని మాంబళంలో హరిదాసుమఠము స్థాపించిరి. వారి కుమారులు వెంకటరమణదాసుగారు అచ్చటనే ఒక రామాలయాన్ని కట్టించారు. అది దక్షిణభద్రాద్రిగా పేరు తెచ్చుకొన్నది. అలా రాముని పట్ల విశ్వాసం, భక్తి పమిడిఘంటం కుదురులో తరతరాలుగా ఉంది. తన పూర్వీకుల వలెనే కోదండరామయ్యగారు కూడా ఇప్పుడు రామాయణం యుద్ధకాండవరకు నిర్విఘ్నంగా ప్రచురణకావడం "రాముడి దయ" అంటారు.

ప్రచురణకు ఏర్పాట్లు చేయడం ఒక ఎత్తు. వాల్మీకికృతరచనకు అర్థతాత్పర్యవ్యాఖ్యానాలు వ్రాయించడం ఇంకొక ఎత్తు. అనువాదానికి స్వతంత్రరచనను మించిన శ్రద్ధాసామర్థ్యాలు అవసరమవుతాయి. అదృష్టవశాత్తు కోదండరామయ్యగారికి ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారి సహాయసహకారాలు లభించాయి. శ్రీరామచంద్రుడుగారు తెలుగునాట వందలాదిమంది సంస్కృత విద్వాంసులను తయారుచేసిన మహాపండితుడు. స్వయంగా విశేషపరిశోధనలు చేసినవారు. ప్రత్యేకించి వాల్మీకి రామాయణ వివిధపాఠాలను అధ్యయనం చేసినవారు. ఆయన అర్థతాత్పర్యాలను ఇచ్చి, వ్యాఖ్యానం కూడా చేశారు. తమ వ్యాఖ్యానానికి ఆయన "బాలానందిని" అని పేరు పెట్టారు. ఆంధ్రపాఠకలోకానికి వివిధవ్యాఖ్యానాల్ని దృష్టిలో పెట్టుకొని చాలా లోతైన పరిశీలనతో కూడిన వ్యాఖ్యానం చేశారు శ్రీరామచంద్రుడుగారు.

పుస్తకప్రచురణ ఒక యజ్ఞం. రామాయణం వంటి బృహత్గ్రంథాన్ని అర్థతాత్పర్యవ్యాఖ్యలతో తెలుగులో ముద్రించడం నిజంగా ఒక మహాయజ్ఞం. ఎందరో మహనీయులు ఈ మహాయజ్ఞంలో కోదండరామయ్యగారికి చేదోడువాదోడుగా నిలిచారు. గుప్తంగా సాయపడిన ఒక ముస్లిం వితరణ గురించి ముందే విన్నవించాను. అలాంటి గుప్తదాతలకు కృతజ్ఞత తెలియజేస్తూ ట్రస్టు తొలి అధ్యక్షులు శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారు "బాలకాండము" ముందుమాటలో వ్రాసిన రెండు వాక్యాలను ఇక్కడ జ్ఞాపకం చేసుకోవడం అప్రస్తుతం కాదు. ఈ గ్రంథముద్రణను గూర్చి తెలియగానే కొందరు అజ్ఞాతంగానే ఉంటూ తమ పేర్లు వెల్లడి చేయకుండా మా సంస్థ ఎక్కౌంటులో డబ్బు జమచేసి పుణ్యం కట్టుకొన్నారు. వారికి మా సంస్థ పక్షాన ధన్యవాదాలు తెలుపుకొనటం మా కర్తవ్యంగా భావిస్తున్నాము" అని వ్రాశారాయన. అలా "బాలకాండము" వెలువడగానే మరెందరో ఆర్షవిజ్ఞానాభిమానులు, వాల్మీకిరామాయణం తెలుగులో రావాలని చిరకాలంగా అభిలషిస్తున్నవారు ముందుకు వచ్చి, మిగతా కాండముల

ముద్రణకు ప్రోత్సహించారు. అయోధ్యాకాండము మొదటిభాగం 1990లో, రెండవభాగం 1991లో వెలువడ్డాయి. మొదటిభాగం ముద్రణకు ప్రముఖ పారిశ్రామికవేత్తలు శ్రీ P. ఓబుల్ రెడ్డి దంపతులు, రెండవ భాగానికి శ్రీ బి.వి.ఎస్.ఎస్.మణి నిర్వహిస్తున్న స్వధర్మస్వారాజ్యసంఘంవారు సాయం చేశారు. సుందరకాండకు మాతృశ్రీ గ్రూపు సంస్థల అధ్యక్షులు శ్రీ మాటూరి వెంకట సుబ్బారావు, విశాఖపట్నం వాస్తవ్యులూ, న్యాయవాదీ తెన్నేటి వేణుగోపాలరావు ముద్రణవ్యయాన్ని భరించారు. శ్రీ యమ్. జనార్ధనరావు (ఆంప్రో), శ్రీ యలమంచి మల్లికార్జునరావు, శ్రీ టి. రఘునాథరెడ్డి, శ్రీ గజ్జెల రంగారెడ్డి (లక్ష్మిదేవమ్మ చారిటబుల్ ట్రస్టు) సమకూర్చిన నిధులతో అరణ్యాకాండము, ఆర్షధర్మప్రచారకులు, పారిశ్రామికవేత్తలు శ్రీ పల్లెంపాటి వెంకటేశ్వర్లు దంపతులు ఇచ్చిన ధనసహాయంతో కిష్కింధాకాండము వెలుగుచూశాయి. ఇప్పుడు మీ చేతుల్లో ఉన్న యుద్ధకాండ ముద్రణకు సాయపడిన సంస్థల, వితరణశీలుర జాబితా ప్రత్యేకం మరొక పేజీలో ప్రచురిస్తున్నాము.

తెలుగులో వలెనే మిగతా భారతీయభాషలలోనూ వాల్మీకిరామాయణానికి అర్థతాత్పర్యవ్యాఖ్యానాలతో కూడిన అనువాదాలు వెలువడవలసిన అవసరం ఉంది. ఈ కృషి ఎంత త్వరలో జరిగితే లోకానికి అంత శ్రేయస్కరం. అయోధ్యలోనో, మరొక చోటనో రామాలయాన్ని నిర్మిస్తే అది అక్కడికి వచ్చే యాత్రికులకు స్ఫూర్తిదాయకం కావచ్చు. కాని, మాతృభాషలో వాల్మీకిరామాయణాన్ని చదివే అవకాశం కల్పించడంవల్ల ప్రతి పఠిత మనస్సు ఒక రామమందిర మవుతుంది. అది ఆలయనిర్మాణాన్ని మించిన మహాకార్య మౌతుంది. జనబాహుళ్యంలో ధర్మచింతన, సత్యనిష్ఠ, సత్ప్రవర్తన పెంపొందడానికి అది నిస్సంకోచంగా దోహదం చేస్తుంది.

'వందే వాల్మీకికోకిలమ్' అంటూ రామాయణం మానవాళికి ఎలా పవిత్రమైనదో, అందులోని విలువలు ఎలా సార్వకాలికాలూ, సార్వజనీనాలూ అయినవో తెలియజేస్తూ కోదండరామయ్యగారు ఒక వ్యాసం వ్రాసినారు. దానిని కూడా ఈ గ్రంథంలో పొందుపరచటమైనది.

పొత్తూరి వెంకటేశ్వరరావు.

# విషయసూచిక

# వందే వాల్మీకికోకిలమ్

రామాయణం తెలియని దెవరికి? తెలిసిన దెవరికి? అనగా రామకథ తెలియని వ్యక్తి లేదు. రామాయణతత్త్వము పూర్తిగా అవగాహన కలిగి, అనుభూతిని పొందిన మహనీయులు చాలా కొద్దిమంది.

ఈ మహాకావ్యము తెలుగులో టీకాతాత్పర్యసహితముగా వెలయుట తెలుగుల పుణ్యముల పంటగా భావించవచ్చును. దీనిని తెలుగుగడ్డలో ఆబాలగోపాలము చదివి జీర్ణించుకొనవలయు ననెడి ప్రకాశకుల ఆశయమునకు అనుగుణముగా ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారు దీనికి బాలానందినీ వ్యాఖ్యానమును సమకూర్చిరి. అయితే ఈ యువతరంవారు ఈ గ్రంథాన్ని ఎందుకు పఠించవలయును? అనెడి ప్రశ్నకు సమాధానమే, ఈ ప్రకాశకులైన ఆర్షవిజ్ఞాన సంస్థ దీనిని ప్రచురించుటకు కారణము. కావున దానిని ప్రస్తావించుట సముచితము.

ఈ మహాకావ్యము ఈ దేశపు సంస్కృతికి, సకల మానవ ధర్మమునకు తరతరాల నుండి ప్రతీకగా నిలబడియున్నది. దీనికి కారణము ఇందలి నాయకుడైన శ్రీరాముడు తన దివ్యమైన కళ్యాణగుణములతో ఈ దేశస్థులను ఉత్తేజపరిచి ఆ గుణములందలి ప్రీతియే ఈ జాతికి నైజగుణముగా చేసెను. అట్టి దివ్యగ్రంథమును ఈ తరపు యువకుడు అధ్యయనము చేయుట వాని కనీస ధర్మము; చేయకున్న తన జాతి నైజగుణమునకు దూరుడగును.

మహాకవి వాల్మీకి ఈ గ్రంథము ప్రారంభముననే దివ్యమైన 16 గుణములు కల మానవుడు ఈ భూమండలములో ఎవరని అడిగి, దానికి సమాధానముగా నారదమహర్షి తెలిపిన దేవతలతో తులతూగు 64 గుణములు కల శ్రీరామచంద్రుని పేర్కొనెను. ఇన్ని దివ్యగుణములు ఒకే వ్యక్తియందుండుట దుర్లభమని తోచుట సహజము. పైగా ఈ కావ్యమునందలి కొన్ని ఘట్టములు :

(i) యజ్ఞపురుషుడు పాయసమును తెచ్చి దశరథుని కిచ్చెను

(ii) సీత అయోనిజ

(iii) వానరులు దేవతాసంతానము, కామరూపులు

(iv) ఆకాశమునుండి గరుడుడు వచ్చి రామలక్ష్మణులకు నాగపాశవిమోచనము చేయుట

(v) స్వర్గమునుండి మాతలి రథము తెచ్చి రామునకు సాయపడుట

(vi) చనిపోయిన వానరులందరు స్వస్థులై పునర్జీవితులగుట.

నిజముగా ఈ కథ ఈ భూమండలమున జరిగినదా యను సందేహమునకు దారితీయును. దీనికి సమాధానము ఇది భువికి దివికి చెందిన కథ. ఇది చాల పురాతనమైన ఇతిహాసము. ఇందు పైన ఉదాహరించిన ఘట్టములు లేనిచో ఇది మామూలు సాంఘికనాటకమును పోలి నాయికానాయకుల ప్రేమ, అందుకు విఘాతము, తిరిగి సమాగమముతో కూడిన ప్రేమకథ మాత్రమే యగును. ఇట్టి ఇతిహాసమును పాశ్చాత్యులు మైథాలజీ అందురు. ఈ శతాబ్దములో మతము, పరతత్త్వవిచారముతో సంబంధము లేకుండా దేశాభ్యున్నతియే పరమావధిగా కృషిచేయవలయు ననెడి మానవతావాదులు కూడా ప్రజలను ఉత్తేజపరచుటకు, వారిని సన్మార్గవర్తనులను చేయుటకు ఇటువంటి ఇతిహాసములు అవసర మనెడి అభిప్రాయమును వ్యక్తము చేసిరి.[1]

పాశ్చాత్యనాగరికతకు, మేధకు నాందీవాక్యము పలికిన మహనీయునిగా పరిగణించబడు ప్లేటో కూడా యువకులను ఉత్తేజపరచుటకు, వారిని విజ్ఞానవంతులుగా, ధైర్యశాలురుగా, క్షమాసంపన్నులుగా, న్యాయధర్మపరాయణులుగా తీర్చిదిద్దుటకు వారికి చెప్పు కథలు నిజము కానవసరము లేదని చెప్పెను. [2]

స్వామి వివేకానంద కూడా మానవునికి హితమును బోధించుటకు సాయపడు నిజమునే చెప్పవలయు ననెడు నియమము లేదని అన్ని జాతులవారు విశ్వసింతురని నుడివెను.[3] రాజకుమారులను రాజనీతివిశారదులను చేయుటకు రచింపబడిన పంచతంత్రము, హితోపదేశమునందలి జంతువుల కథలు దీనినే బలపరచును.

ఈ కథాభాగమునందు మానవుని ఊహకు అతీతమైన ఘట్టములున్ననూ

---

1 రాజగోపాలాచారి రామాయణం : రెండవ ఎడిషన్ ఉపోద్ఘాతము. బెర్నాడ్ షా అభిప్రాయము తెలుపుచూ.

2 ది రిపబ్లిక్ - ప్లేటో - పుస్తకము - III

3 పుట 106 - వాల్యూం IV - వివేకానంద పూర్తి రచనలు - మాయావతి మెమోరియల్ ఎడిషన్.

మహాకవి వాల్మీకి కథానాయకుడగు శ్రీరాముని ఆదర్శమానవునిగా తీర్చిదిద్దెను. యుద్ధకాండయందు దేవతలు రాముని శ్రీమహావిష్ణువని తెలిపిననూ శ్రీరాముడు తాను దశరథుని కుమారు డను మానవునిగా తలచుచున్నానని (ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్) నుడివెను. దానికి అనుగుణముగా వనవాసము మొదలైన మొదటిరోజు విరాధుడు సీతను ఎత్తుకొని పరుగిడినపుడు, సీతను రావణుడు అపహరించిన ఘట్టమునందు, మాయసీతను ఇంద్రజిత్తు చంపెనను వార్త విన్నపుడు శ్రీరాముని దుఃఖము, విలాపము ఆయనను మానవమాత్రునిగా నిరూపించెను. సముద్రుని శరణువేడుట, రావణవధకై సూర్యుని స్తుతించుట మొదలగు ఘట్టములు మానవుని ప్రయత్నమును, కార్యసాధనను తలపించెను.

కావున రాముని ఆదర్శపురుషునిగా మన ముందిడుకొని ఈ గ్రంథము పఠించిన ఇందలి ఉపదేశములు మనకు పుష్కలముగా లభించును.

మనము ధర్మసూత్రములను వినుటవలన, వల్లించుటవలన, అవి మన మనస్సుకు హత్తుకొనవు. ఆ ధర్మపథము ననుసరించిన మహనీయుల చరిత్రవలన ఆ ధర్మము మనకు పూర్తిగా అవగాహన కలిగి దానిని అనుసరించుటకు ఉత్తేజితులమగుదుము. ఈ సూత్రము స్వామి వివేకానంద వక్కాణించెను.[1]

మరియు ధర్మము దురవగాహము. శ్రుతిస్మృతులు, పండితవాక్యములు, చాలా విభిన్నములుగా ఉండుటచే ధర్మనిర్ణయము కష్టసాధ్యము. అందుచే ఋషివాక్యము "మహాజనో యేన గతస్స పంథాః" మహాజనులు నడిచిన మార్గమే తక్కినవారికి మార్గము.

అయితే మహాపురుషులు ఎవరని ప్రశ్న ఉత్పన్నమగును. ఎవరి కీర్తి భూమ్యాకాశములు నిండియున్నదో వాడే మహాపురుషుడు. శ్రీరాముడు, బుద్ధుడు, క్రీస్తు, గాంధీ మొదలగువారు మహాపురుషులు. శ్రీరాము డట్టి కీర్తివంతు డనుట నిర్వివాదాంశము. ఆయన పయనించిన మార్గమే రామాయణము.

ఇంతవరకు పాఠకుని అభిముఖుని చేయుటకు అవసరమైన సంగతులు ప్రస్తావించితిమి. ఇవి ఆధారముగా పాఠకుని ఆభిముఖ్యము దృఢపడుటకై రామాయణములోని కొన్ని ఉత్కృష్టవిషయములను వివరింతుము.

ఈ మహాకావ్యసౌధమునకు -

1. సత్యము, ధర్మము, సూత్రప్రాయమగు మూలస్తంభములు.

---

[1] పుట 121 - వాల్యూం IV - వివేకానంద పూర్తి రచనలు - మాయావతి మెమోరియల్ ఎడిషన్.

2. పితృభక్తి, దాంపత్యపవిత్రత, మహోన్నతశిఖరములు.

3. ఈ సత్యధర్మములే ఆచరణరూపము దాల్చినపుడు కథానాయకుని కళ్యాణ గుణములుగా ప్రకాశించును.

ఈ వరుసలో వీటిని పరిశీలింతము :

సత్యము :- సత్యము ఆధ్యాత్మికపారిభాషలో పరతత్త్వాన్ని సూచించును. అందుచే శ్రుతి 'సత్యం బ్రహ్మ' అని చెప్పినది. ఆ సత్యమును కనుగొనుటకు మార్గము కూడా సత్యమే. అందుచే మానవుడు అనుష్ఠించవలసిన ధర్మములలో సత్యము మొట్టమొదటిదిగా శ్రుతి శాసించినది. "సత్యం వద". స్థూలముగా సత్యమనగా యథార్థభాషణ. ఇంద్రియములకు ఒక విషయము ఎటుల గోచరించునో అట్లు చెప్పుట. కాని పండితులు సత్యము యథార్థభాషణము మాత్రమే కాదు, అది మానవుని కళ్యాణమునకు, అభ్యుదయమునకు తోడ్పడవలయునని నుడివిరి. అందుచే ఋషివాక్యము - "సత్యం కళ్యాణహితం", "సత్యం సర్వహితం ప్రోక్తం యథార్థకథనం నహి".

సత్యభాషణము కాలము, స్థలము, ఉద్దేశ్యమును బట్టి మారునని కూడా మేధావులు అభిప్రాయమును వెల్లడి చేసిరి. సత్యములో కపటము, మోసము ఉండకూడదు. "సత్యం త్రయోదశముఖమ్" సత్యము సమత, దయ, అహింస, క్షమ, ఆత్మనిగ్రహము మొదలగు 13 ముఖములు కలిగి ఉండునని భారతమున చెప్పబడినది. అనగా ఈ సమత, దయ, అహింస మొదలగు గుణములు లేనివారు సత్యమును అనుష్ఠింపజాలరు.

ఆచరణలో ఎంత భేదమున్ననూ ఈ సత్యాన్ని ఆస్తికుడు, నాస్తికుడు, హేతువాది - అందరూ అంగీకరింతురు. దీని ఆవశ్యకతను ఎవరూ నిరసించరు. మానవుడు దీనిని ఎందుకు అవలంబించలేకపోవుచున్నాడనగా "స్వార్థపరత్వంవల్లనే" అని నుడివిన వివేకానందుని వాక్యములు నిర్వివాదాంశములు.

ధర్మము :- సత్యమును అవలంబించుటకు అనుసరించవలసిన మార్గము ధర్మము. ధర్మము సాధనము; సత్యము సాధ్యము. ఈ ధర్మము బహుళము. సత్యము ఒక ధర్మము. మానవుడు తన శరీర, మానస, ఆత్మవికాసమునకు తన కుటుంబసభ్యులయెడల, సంఘమునందలి ఇతర మానవులయెడల, సర్వభూతములయెడ అవలంబించవలసిన సూత్రములన్నియు ధర్మనిబంధకాలే. ధర్మాచరణవలన మనకు అభ్యుదయము, నిశ్శ్రేయసము కలుగును. నిశ్శ్రేయసము పరతత్త్వవిషయమని నిరసించిననూ అభ్యుదయమునకైననూ, ధర్మాచరణ అవసరము. మహాకవి వాల్మీకి ఈ సత్యధర్మములను గూర్చి అనర్ఘవచనములు

వివిధపాత్రలద్వారా మన కందచేసెను. అందులో కొన్ని -

"సత్యే ధర్మః ప్రతిష్ఠితః" - ధర్మము సత్యముమీద ఆధారపడి ఉన్నది. "ధర్మే సత్యం ప్రతిష్ఠితమ్" - ధర్మమునందే సత్యము నిలిచి ఉన్నదని ఈ రెండింటికి అవినాభావసంబంధమును విపులీకరించెను. సత్యమును ధర్మమును రక్షించువాడే రాజు. ఎట్లు నేత్రము దేహమునకు మంచిని కలుగజేయుచు, చెడును తొలగించుటకు ఉపకరించునో రాజు రాజ్యమునందలి బాధలన్నియూ తొలగించి సత్యధర్మపోషణకు కారణభూతుడు. "సత్యాన్నాస్తి పరం పదమ్" - సత్యమును మించిన ఉత్తమధర్మము లేదు. "సత్యే లోకః ప్రతిష్ఠితః" - సత్యముమీదనే లోకము నిలిచియున్నది. ధర్మము సురుల పక్షము, అధర్మము రాక్షసుల పక్షమును ఆశ్రయించియుండును. ధర్మమువలన అధర్మము పరాజితమైన అది కృతయుగము. అధర్మమువలన ధర్మము పరాజితమైన అది కలియుగము. "సత్యధర్మాభిరక్తానాం నాస్తి మృత్యుకృతం భయమ్" - సత్యధర్మములను అనుసరించినవానికి మృత్యుభయము లేదు. "భవతామ్ ఆర్జవం బలమ్" - కపటము లేకపోవుటయే మీకు బలము అని రామలక్ష్మణులను గరుత్మంతుడు శ్లాఘించెను.

ఈ మహావాక్యమునందు కథానాయకుడగు రాముడు సత్యసంధుడు, సత్యవ్రతుడు, సత్యవచనుడు, సత్యపరాక్రముడు, ధర్మజ్ఞుడు, సత్యధర్మపరాయణుడు, 'సత్యే ధర్మ ఇహపరః" - సత్యరక్షణలో రెండవ ధర్మదేవత వంటివాడు, "రామో విగ్రహవాన్ ధర్మః" - రాముడు మూర్తీభవించిన ధర్మస్వరూపుడు అని వర్ణించి కవి ఆతనిని అనంతగుణగంభీరునిగా తీర్చిదిద్దెను. ఆ గుణములను కొన్నింటిని సుదీర్ఘముగా పరిశీలింతము.

పితృభక్తి/దాంపత్యపవిత్రత :- ఈ రెండు విషయములవలననే ఈ కథ ప్రాగ్దిశకు చెందిన కథగా పరిగణించబడును. పశ్చిమదేశవాసులకు భరతుని పట్టాభిషేకముతో పాటు కైక కోరిన రెండవ వరమైన రాముని వనవాసము అర్థరహితముగా న్యాయవిరుద్ధముగా తోచును. రాజు తన కిష్టమైన కుమారునకు రాజ్యము నీయవచ్చును కాని ఏ అపరాధము చేయని రాముని అరణ్యావాసము చేయమనుట న్యాయవిరుద్ధము. మన దేశస్థులలో పితృవాక్యపరిపాలనయందు పూర్తి విశ్వాసము లేనివారు కూడా అటులనే అభిప్రాయపడగలరు. ఈ సందర్భమున లక్ష్మణుడు పలికిన వాక్యములు కూడా దానినే సూచించును. న్యాయము హక్కులకు ప్రాధాన్యము నిచ్చును. ధర్మము కర్తవ్యమునకు ప్రాధాన్యము నిచ్చును. అందుచే రాముడు 'అవిచార్య పితుర్వాక్యం..." - నేను తండ్రిమాటలోని యుక్తాయుక్తవిచారణ చేయక ఆయన ఆజ్ఞను పరిపాలించెదనని చెప్పెను. ఈ కథయందు ఈ సన్నివేశము చాలా ప్రధానమైనది.

శ్రీరాముడు సుమంత్రునిద్వారా అందిన సందేశము ననుసరించి కైక గృహమందున్న తండ్రిని. చూచుటకు వెళ్లెను. తండ్రిని చేరగానే తండ్రికి, కైకకు పాదాభివందనము చేసి, వాడిన ముఖముతో దీనుడై తనను చూచి 'రామా' అని పిలిచి కన్నీటితో నిండిన నేత్రములు కల తండ్రిని చూచి 'పదా స్పృష్ట్వేవ పన్నగమ్' - పామును తొక్కినవానివలె భయపడెను. ఈ దుఃఖమునకు కారణమును ఊహించలేక దీనుడై శోకార్తుడై తండ్రి "యతో మూలం నరః పశ్యేత్... ప్రత్యక్షే సతి దైవతే" - తన జన్మకు మూలకారణమగు తండ్రి ప్రత్యక్షదైవము కదా! ఆయనను సంతోషపెట్టకుండా ముహూర్తమైనా జీవింపవలెనని కోర్కె లేదని తెలిపెను. అందుకు కైక "రాజు చెప్పనున్నది నీకు అప్రియమైననూ చేసెదనని మాట ఇచ్చినచో నేనే చెప్పెదను. రాజు చెప్పజాల" డని పలికెను. అందుకు రాముని సమాధానము - "ఛీ!ఎంత కష్టము కలిగినది! నా విషయమున నీవిటుల మాటలాడుట తగదు. తండ్రి చెప్పిన అగ్నిలో దూకెదను. ఆయన ఆజ్ఞాపించిన విషము త్రాగెదను. సముద్రములో మునిగెదను. 'రామో ద్విర్నాభిభాషతే' - రాముని వద్ద రెండు మాటలు లేవు. దానిపై ఆమె కోరిన రెండు వరములు తెలిపెను. 'వచనం మరణోపమమ్' - మరణశాసనమువంటి ఆ మాటలను విని రాముడు ఏమియూ వ్యథ చెందలేదు. కాని ఇట్లు పలికెను. రాజు భరతుని రాజ్యాభిషేకమును గూర్చి నాకు స్వయముగా చెప్పలేదను వ్యథ నా హృదయమును కాల్చివేయుచున్నది. నాపై అధికారము కలదానివై యుండి కూడా భరతరాజ్యాభిషేకవిషయము నాతో చెప్పక తండ్రితో చెప్పితివి. దీనినిబట్టి నీకు నా గుణములపై నమ్మికలేదని నిశ్చయముగా తెలియుచున్నది. 'అహం హి సీతాం రాజ్యం చ ప్రాణానిష్టాన్ ధనాని చ, హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతాయాః ప్రచోదితః' - నా తమ్ముడగు భరతునకు అభిలాషయున్నచో నన్నెవ్వరూ ప్రేరేపించకుండా స్వయముగా సీతను, రాజ్యమును, ప్రాణములను, ఇష్టజనములను, ధనమును సంతోషపూర్వకముగా నిచ్చెదను. 'విద్ధి మామ్ ఋషిభిస్తుల్యం కేవలం ధర్మమాశ్రితమ్' - నాకు ధనము ప్రధానము కాదు. లోకమర్యాదను పాటించువాడను. కేవలము ధర్మమును మాత్రమే ఆశ్రయించు ఋషితుల్యుడను అని చెప్పెను. ఈ వాక్యములు శ్రీరామునికి చిరస్థాయి యగు కీర్తి గడించి పెట్టి, మర్యాదారామునిగా ముల్లోకములందును ప్రసిద్ధి నొందించెను.

ఈ దేశస్థులు వృద్ధులైన తల్లితండ్రులకు చూపు గౌరవము, వారికి చేయు సేవలను చూచి విదేశీయులు ముగ్ధులై ప్రశంసించెదరు. అది రామాయణప్రభావము. శ్రీరాముడు తండ్రియెడ చూపిన భక్తి ఈ దేశమున ఆచారముగా నిలచినది. అందుచే ఈ దేశస్థులు కొందరు తండ్రి ఎదుట తొందరగా మాట్లాడుట కాని, కూర్చొనుట కాని చేయరు. రాముడు వివాహము తదుపరి అయోధ్యకు వెళ్లు సమయమున పరశురాముడు వచ్చి చాలా చులకనగా

మాట్లాడుచు యుద్ధమునకు ఆహ్వానించెను. కాని రాముడు 'గౌరవాద్యంత్రితకథః పితూ రామమథాఽబ్రవీత్" - తండ్రి దగ్గరగా నుండుటచే ఆయనపై నున్న గౌరవభావముచే అధికముగా మాట్లాడక మితముగా మాట్లాడెను. మరియు రామునకు తన భార్యపై గల ప్రేమకు కారణము ఆమె రూపము, గుణములు కాక 'దారాః పితృకృతా ఇతి' - తండ్రి అంగీకరించి ఆయన సమకూర్చిన సంబంధమగుటయే అనియు, రూప, గుణములచే ఆమె ఎక్కువ ప్రీతిపాత్రురా లాయె ననియు వాల్మీకి పేర్కొనెను.

రాజ్యముకొరకై లేదా ఆస్తికొరకై కూడా తండ్రిని చంపిన మానవులను ఈ భూమండలమున చూచుచున్నాము. తల్లిదండ్రుల యెడ భక్తి తేలికగా అలవడునదికాదు. ఆ భక్తికల దేశస్థులు సౌభాగ్యవంతు లనుటకు సందేహము లేదు. సత్యము, ధర్మముతో పాటు పితృభక్తి కూడా నీకు పుష్కలముగా కలదని దండకారణ్యమునందలి ఋషులు రాముని శ్లాఘించిరి.

రాముని పితృభక్తి మానవుడు తలిదండ్రుల యెడ చూపవలసిన సాంఘికధర్మము మాత్రమే కాదు. అది 'మాతృదేవో భవ' 'పితృదేవో భవ' - తల్లిదండ్రులు దైవస్వరూపు లనెడు శ్రుతివాక్యమునకు తులతూగు దార్శనికప్రక్రియ.

ఇక రెండవ విషయము దాంపత్యపవిత్రత: స్వామి వివేకానందుడు నుడివినట్లు అపవిత్రతను దూరము చేయుటకే వివాహము. వివాహనియమము లేనివాడు నాగరికునిగా పరిగణించబడడు. అడవిజాతివాడే వానికన్నా అధికుడ గును. అందుచే ప్రతిదేశములో, ప్రతిమతములో దాంపత్యధర్మమును నిర్దుష్టముగా శాసించుట జరిగినది. బైబిల్‌లో భార్య శరీరముపై అధికారము భర్తకు గలదని, అటులనే భర్త శరీరముపై అధికారము భార్యకే కలదని చెప్పబడినది. పురుషుడు పరస్త్రీని తాకకుండుటయే ఉత్తమనియమమని చెప్పబడినది. పురుషుడు స్త్రీని చెడు తలంపుతో చూడగానే పాపాచారపరాయణుడుగా పరిగణించబడునని క్రైస్తు చెప్పెను. ఈ పవిత్రతను వక్కాణించుటకే ఖురాన్‌లో భగవంతుడు పురుషుని, అతని భార్యను ఒకే శరీరమునుండి సృజించెనని చెప్పబడినది.[1]

మన దేశములో వివాహమైన స్త్రీ వ్రతధారిణిగా పరిగణించబడినది. అందుచే ఆమె దర్శనము శుభసూచకము. ఆమె వివాహము చేసుకొని జీవితాంతము నియమములోనున్న తపస్విని. ఈ మహాకావ్యమునందలి నాయకుడైన శ్రీరాముడు ఈ వ్రతమును తాను కూడా స్వీకరించి ఏకపత్నీవ్రతుడుగా ప్రఖ్యాతి గాంచెను. ఈ సీతారాములకు ఆదర్శదంపతులు ఈ భారతావనిలో అరుం

[1] ఈ ప్రస్తావన బృహదారణ్యకోపనిషత్తులో నున్నది.

ధతీవసిష్ఠులు, లోపాముద్రాఅగస్త్యులు, సుకన్యాచ్యవనులు, సావిత్రీసత్యవంతులు, దమయంతీనలులు మున్నగు వారని సీతాదేవియే పేర్కొనెను.

పాణిగ్రహణసమయమున జనకమహారాజు రాముని తన కూతురగు సీతను సహధర్మచారిణిగా పరిగ్రహింపుమని కోరును. 'పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా' అని చెప్పెను. ఈ ఉపమానము చాలా దివ్యమైనది. మహాభాగ్యవంతురాలగు ఈమె పతివ్రతయై నీడవలె సర్వదా నిన్ను అనుసరించునని పలికెను. ఈ దంపతుల ప్రేమనే వాల్మీకి దివ్యముగా ప్రశంసించెను.

'దారాః పితృకృతా ఇతి' - తండ్రి అంగీకరించి చేసిన సంబంధమగు టచేతను, ఆమె రూపసద్గుణములచేతను రామునకు సీతపై గాఢానురాగము కలిగెను. కాని సీత మాత్రము అట్టి కారణములతో అవసరములేకుండా భర్త యను ఒక్క కారణము చేతనే రామునిపై రెట్టింపు ప్రేమ కలిగియుండెను. వారి ప్రేమ ఎంత ఉత్కృష్టమనగా వారు నోటితోకాక హృదయముతోనే మాట్లాడుకొనెడివారు. అనగా ఒకరి హృదయములో నున్న భావము ఒకరు సులభముగా గ్రహించి తదనుగుణముగా ప్రవర్తించెడివారు.

తనకు రానున్న రాజ్యము చేజారిపోయి, జటాధారియై, దీర్ఘకాలము అరణ్యవాసము చేయవలసివచ్చిన భర్తను అనుగమించినందుకు సీతను అనసూయాదేవి శ్లాఘించెను. అందుకు సమాధానముగా సీతాదేవి "స్త్రీకి భర్త పూజ్యుడు. అందుచే నాభర్త చరిత్రహీనుడైననూ అతనిని అనుసరించెడిదాన నని పలికెను. మరియొక సందర్భమున భర్తతో తన అనుబంధమును వర్ణించుచు 'సూర్యకాంతి సూర్యునినుండి వేరుగానటుల నేను రామునినుండి వేరుగా' నని పలికెను. పరపురుషుడగు రావణుడు బలాత్కారముగా అపహరించి పదిమాసములు తన ఇంటిలో ఉంచుకొనెనన్న కారణముచే ఇటువంటి దివ్యమైన దాంపత్యమునకు కూడా కాలవైపరీత్యమువలన కళంక మాపాదింపబడెను. రాముడు రావణుని సంహరించి సీతను స్వాధీనపరచుకొనెను. కాని ఈ కళంకమును బాపుట ఎటుల? రావణవధానంతరము రాముని ఆజ్ఞానుసారము విభీషణుడు సీతాదేవికి స్నానము చేయించి, అలంకృతను గావించి రాముని సమ్ముఖమునకు తీసుకొని వచ్చును. ఆమెను చూడగానే రామునకు హర్షము, దైన్యము, రోషము, ఒక్కమారు ముప్పిరి గొని వచ్చినవి. ఎట్టకేలకు సీతను చూడగలిగితిని గదా అని సంతోషము, ఈమెను ఎటుల విడువవలయునని దైన్యము, చిరకాలము రాక్షసుని ఇంటనున్న దానిని ఎటుల పరిగ్రహింపవచ్చునని కోపము, ఈ మూడును ఒక్కసారి కలిగెను. అందుపై రాముడు 'ఇంత కాలమునకు రావణుని అంకమునుండి దిగివచ్చినదానవు. అతనిచే మన్మథాతురమగు దృష్టిచే చూడబడినదానవు. గొప్పకుటుంబమున పుట్టి

ఆ కులమునకు కీర్తి తేవలసిన నేను ఎటుల నిన్ను పరిగ్రహింతును? నీ ఇష్టము వచ్చిన స్థలమునకు పొమ్మని నీతో పనిలేదని దుర్భరవచనములను పలికెను. దానికి సీతాదేవి తనకు భర్తపై గల భక్తిని, తన శీలమును వివరించి రామునిలో మార్పు లేకుండుట గ్రహించి "ప్రియునివలన మిథ్యాపవాదమును పొంది జీవించనొల్లనని చితిని పేర్చుమని" లక్ష్మణునితో తెలిపి, రామునకు ప్రదక్షిణము చేసి, 'నా మనసు ఎప్పుడూ రాముని తప్ప పరపురుషునియందు చలించనిచో అగ్నిహోత్రుడు నన్ను రక్షించుగాత,' అని శపథము చేసి శరీరమునం దెంతమాత్రము ఆసక్తిలేనిదై మండుచున్న అగ్నిలో ప్రవేశించెను. ఆ ఆహుతిని మూడులోకములు తిలకించినవి. అచట గల స్త్రీలు ఆక్రందించిరి. రాక్షసులు వానరులును హాహాకారము గావించిరి. రాముడు కూడా కనులనుండి నీరుకార చింతాక్రాంతుడై యుండెను. అపుడు దేవతలు బ్రహ్మదేవుని ముందిడుకొని సీతాదేవి అగ్నిప్రవేశమున సర్వజ్ఞుడగు రాముని ఉదాసీనతకు ఆశ్చర్యము ప్రకటించిరి. అపుడు అగ్నిహోత్రుడు మానవాకారమున చితినుండి దివ్యముగా వెలుంగు సీతాదేవిని తీసుకొని వచ్చి రామునకు సమర్పించి "ఈ సీత త్రికరణశుద్ధిగా నిన్ను తప్ప మరియొక పురుషుని ఎంతమాత్రము తలచినది కాదు. ఈమె పరిశుద్ధహృదయము కలది. పాపరహిత. ఈమెను పరిగ్రహించుము. నేను ఆజ్ఞాపించుచున్నాను." అని చెప్పెను. అందుకు రాముడు సీత పాపరహిత యని నాకు తెలియును. ఆమెను పరిశోధించక గ్రహించిన రాముడు మూఢుడు, కాముకుడు, ఎంత మాత్రము ధర్మచింతలేని వాడని తలంతురు. అందుచే అగ్నిలో ప్రవేశించుచున్ననూ ఉపేక్షించితిని. ఆమె ప్రభావము నాకు తెలియును. సూర్యునికంటె సూర్యకాంతి భిన్నము కాన్నట్లు సీత నాకంటె ఎంతమాత్రము భిన్నము కాదని వచించి దేవతల ఆజ్ఞానుసారము సంతోషముగా ఆమెను స్వీకరించెను.

ఈ ఘట్టము ఈ మహాకావ్యమున లేనిచో ఇది 'ఇలియడ్ మరియు ఒడెస్సె'ని పోలు వీరగాథ మాత్రమే అయ్యుండెడిది. మెలెనస్ భార్య హెలెన్ అను సౌందర్యవతిని ట్రాయ్‌దేశస్థు డపహరించగా ట్రోజన్‌యుద్ధములో గ్రీకురాజు ఆమెను తిరిగి స్వాధీనము చేసుకొనెను. గ్రీకుదేశస్థుల కిది దివ్యమైన వీరగాథ. ఇతరులు అపహరించిన భార్యను తిరిగి స్వీకరించుట పెద్ద సమస్య. అట్టి పరిస్థితిలో ప్రజలు ఆమె పవిత్రతను శంకించుటలో ఆశ్చర్యము లేదు. అట్టి సందర్భమున ముఖ్యముగా రాజైనవాడు 'ప్రజావాక్యం తు కర్తవ్యం' అను ఆర్యోక్తిని పాటించక తప్పదు. అగ్నిపరీక్ష యనెడు ఈ సన్నివేశము ఈ మహాకావ్యమునకు పవిత్రతను, తేజస్సును చేకూర్చినది.

## శ్రీరాముని కళ్యాణ గుణములు :

ఈ కావ్యమున మహాకవి వాల్మీకి నారదుడు, దశరథుడు, పౌరులు, సుమిత్ర, ఆంజనేయుల ద్వారా రాముని కళ్యాణగుణములను అభివర్ణింప చేసి మన కందించెను. తాను కూడా అయోధ్యాకాండ మొదటిసర్గలో ఆ కళ్యాణగుణములను సుదీర్ఘముగా వర్ణించి అటువంటి గుణములు కల రాముడు తనకు ప్రభువు కావలయునని భూదేవియే కోరినట్లు వచించెను. ఈ కళ్యాణగుణములను మూడు భాగములుగా విభజించవచ్చును.

1. రూపగుణములు - రాముని దివ్యమంగళవిగ్రహమును వర్ణించునవి.
2. చక్రవర్తికి ఉండవలసిన వీర్యశౌర్యపరాక్రమములు మరియు పరిపాలనా దక్షత.
3. ఆదర్శపురుషునకుండవలసిన కళ్యాణగుణములు మరియు వృత్తము.

1. రూపగుణములు :

ప్రప్రథమమున నారదుడు వివరించిన 64 గుణములలో 20 రూప గుణములు. 20 పరిపాలనాదక్షతకు సంబంధించిన చక్రవర్తి గుణములు. 24 ఆదర్శపురుషున కుండవలసిన కళ్యాణగుణములు.

వాల్మీకి రాముని బాహువులు, వక్షస్థలము, కంఠము, చెక్కిళ్ళు, మూపు, శిరస్సు, నుదురు, నేత్రములు విడివిడిగా వర్ణించి, సర్వావయవములు సాముద్రిక శాస్త్రోక్తలక్షణములు కలిగి ఇంపైన రంగు, దేహకాంతి, తేజస్సుతో కూడి యుండెనని, రాముడు చంద్రుని వలె ఆనందకరమగు ప్రియదర్శను డని శ్లాఘించెను. హనుమంతుడు సీతాదేవి కోరికపై, రాముని రూపమును ఇంకా సుదీర్ఘముగా ప్రతి అవయవమును వర్ణించి రాముడు 96 అంగుళముల ఎత్తైనవాడు, సర్వసత్త్వమనోహరుడు, రూపదాక్షిణ్యసంపన్నుడని నుడివెను. యోగదర్శనమున పతంజలి మహర్షి కాయసంపదను రూపలావణ్యబలవజ్రసంహనత్వాని అని వర్ణించెను. అనగా సౌందర్యము, శరీరకాంతి, బలము, శరీరావయవ సంఘటనము, వజ్రము వలె దృఢముగా నుండుట అని తాత్పర్యము. ఈ గుణము లన్నియూ రాముని దివ్యమంగళవిగ్రహమున కలవు.

వనములో నివసించు ఋషులు రాముని రూపము, శరీరసౌష్ఠవము, శోభ, సౌకుమార్యమును జూచి ఆశ్చర్యభరితులైరి. 'అరణ్యమున వన్యమృగముల భయము కలదు. నీవు రాతగ' దని సీతతో రాముడు పలికినపుడు అందుకామె 'అదృష్టపూర్వరూపత్వాత్' అని పూర్వమెన్నడూ చూడని నీ రూపమును జూచి మృగములు దూరముగా పోవునని పలికెను. గుణములకు రూపగుణములకు

నిత్యసంబంధము కలదనెడు విషయమును సాముద్రికశాస్త్రవాక్యమే కాక మానవుని అనుభవము కూడా దృఢపరచును. కంటికింపైన రూపము ప్రీతిని కలిగించును. ఆ వ్యక్తి సుగుణవంతుడని తెలిసిన ఆ ప్రేమ ద్విగుణీకృత మగును.[1] శ్రీరాముని విషయములో కూడా ఆయన రూపగుణములతో బాటు ఆయన కళ్యాణగుణములు ఆయన యెడల ప్రీతిని ఇనుమడింప చేయును.

2. ఇక రెండవభాగము వీర్య శౌర్య పరాక్రమములకు, పరిపాలనాదక్షతకు చెందినవి. రాముడు వీర్యమున విష్ణువుతో సముడు. ధైర్యమున హిమవంతుని పోలును. కావున శత్రునిబర్హణుడు, రిపునిషూదను డని ఖ్యాతి పొందెను. అతడు ప్రతాపవంతుడు. గొప్పధనువు కలవాడు. ధనుర్వేదనిష్ణాతుడు. ఆయన కోపము కాలాగ్నిసదృశము. యుద్ధమున సురాసురులు కూడా అతనిని ఎదురింపలేరు. తాను వికారము చెందక శత్రువులో వికారమును పొందించుట వీర్యము. నిర్భయముగా నుండి పోరుట శౌర్యము. శత్రుజయమునందు ఉత్సాహము పరాక్రమము. పరాక్రమమువలన వచ్చునది యశస్సు. రామునకు ఈ గుణములన్నియూ పుష్కలముగా కలవు.

బలపరాక్రమములు లేనివాడు సాధువుగా కాని సన్న్యాసిగా కాని పరిగణించ బడును. అతడు తనకు తానే రక్షించుకొనజాలడు. ఇక ఇతరుల నెట్లు రక్షించగలడు? అటువంటి వ్యక్తిపై ప్రజలకు గౌరవము ఉండదు. మన అనుభవములో ప్రతి నాటకములో సినిమాలో నాయకుడు పదిమందితో ఒంటరిగా పోరి గెలువగల సమర్థునిగా చూపింతురు. అది నాయకున కుండవలసిన ముఖ్యమైన లక్షణము. చక్రవర్తి కిది సహజలక్షణము.

రాముడు పరాక్రమవంతుడు, కీర్తిశాలి అయిననూ 'న దృప్తః' - గర్వించనివాడు. 'న చ మత్సరీ' - మత్సరము లేనివాడు. 'అనసూయుః' - అసూయ లేనివాడు. 'జితక్రోధః' క్రోధమును జయించినవాడు. అందుచే 'క్రోధమాహారయత్తీవ్రం' 'రోషమాహారయత్తీవ్రం' అనగా తీవ్రమగు కోపమును, తీవ్రమగు రోషమును తెప్పించుకొనువాడని వాల్మీకి వర్ణించెను. మరియు 'న చావమన్తా భూతానాం' - ఏ ప్రాణిని అవమానించడు. అట్లే 'న చ కాలవశానుగః' - కాలమునకు వశమగువాడు కాడు. లొంగువాడు కాడు. చక్రవర్తి కుండవలసిన గాంభీర్యక్షమాగుణములయందు సముద్రునితో భూదేవితో సమానుడు.

ఇక ప్రజాపరిపాలనాదక్షత ఈ గుణములకు శోభ చేకూర్చును. అతడు "ప్రజానాం చ హితే రతః" - ప్రజలహితమునందు ఎక్కువ ఆసక్తి గలవాడు,

---

1 రూపమేవాస్యైతన్మహిమానం వ్యాచష్టే - రూపమువలన మహిమ తెలియునని శ్రుతి.

"ధాతా" - సమస్త ప్రపంచమును పోషించువాడు. అందువలన "ప్రజాపతిసమః" అనగా బ్రహ్మదేవునితో సమానుడని కీర్తి బడసెను.

అతడు 'రక్షితా జీవలోకస్య, ధర్మస్య పరిరక్షితా' - ప్రాణిసముదాయమును రక్షించువాడు, ధర్మమును లెస్సగా రక్షించువాడు. మరియు చక్రవర్తికి ఉండవలసిన రెండు గుణములు రామునియందు కలవు. ఒకటి 'సర్వసమః' - అందరియెడ సమునిగా సమానమగు ప్రేమతో వ్యవహరించుట, 'సమాధిమాన్' - ఆశ్రితుల కందుబాటులో ఉండి వారిని రక్షించుటకై దీక్ష వహించుట. అందుచే అతడు 'సర్వలోకప్రియః' - సర్వలోకములకు ప్రీతిపాత్రుడాయెను.

పౌరులను తండ్రి కుమారుని అడిగినట్లు సర్వదా కుశలప్రశ్నలు చేయువాడు. వారికి ఆపద కలిగిన మిక్కిలి దుఃఖించువాడు. సంతోషము కలిగిన తండ్రి వలె సంతసించెడివాడు. రామునికి ఆయురారోగ్యబలములు చేకూరవలయునని ప్రజలందరు కోరుచుండువారు. వృద్ధమహిళలు యువతులు ప్రాతస్సాయంకాలములందు సర్వదేవతలను ప్రార్థించెడివారు.

అతడు ప్రజాపాలనతత్త్వజ్ఞుడు. అనగా పరిపాలనయందు మెలకువలు తెలిసినవాడు. భరతుడు వనములోనున్న తనను అయోధ్య కాహ్వానించుటకు వచ్చినపుడు భరతుని "రాజ్యమును చక్కగా పరిపాలించుచున్నావా?" అని అడిగిన బహుళప్రశ్నలు రాముని రాజ్యపరిపాలనాదక్షతను, నైపుణ్యమును తెలియజేయును. మహాకవి వాల్మీకి 'రామో రాజ్యముపాసిత్వా' అని రాముడు రాజ్యము నుపాసించెనని పరిపాలనయందలి శ్రద్ధను వివరించెను.

3. ఇక మూడవ భాగము సర్వమానవు లనుష్ఠింపవలసిన పరమధర్మములు. 'త్రింశల్లక్షణవాన్ ధర్మః' అని వేదవ్యాస వచనము. అనగా 30 లక్షణములు కలది ధర్మము. అందు సత్యము, దయ, తపస్సులతో కూడిన ఇరువది కర్మాచరణకు సంబంధించినవి. మిగతా పది శ్రవణ కీర్తనాది తత్త్వవిచారమునకు సంబంధించినవి. అందు చివరిది ఆత్మసమర్పణము. ఈ ధర్మములు కల మానవుడు సర్వాత్ముడై తుష్టిచెందును. మనము కర్మాచరణకు సంబంధించిన ధర్మములను మాత్రము పరిశీలింతము.

ఈ జగత్తు ధర్మమార్గమున నడుచుటకు సత్యము, దయ, తపస్సు, దానము అత్యవసరము. అందుచే మహర్షులు గోరూపమున నుండు ధర్మదేవతకు ఈ పై నాలుగు ధర్మములు నాలుగు పాదము లని అలంకారికముగా నుడివిరి. ఈ ధర్మములే ఆచారణరూపమును దాల్చినచో గుణములుగా ప్రకాశించును. రాముడు వేద వేదాంగములను సర్వశాస్త్రములను అధ్యయనము చేసి వాని సారాంశమును

తెలిసినవాడు. అందుచేత సర్వజ్ఞుడై, నీతికోవిదుడై, విచక్షణజ్ఞానము కలిగి, శాస్త్రవిషయమున, లౌకికవిషయమున చక్కని అవగాహన కలిగి పూర్వాపరములను తెలిసి మాటలాడగల వక్తృత్వము సంపాదించి, జ్ఞానసంపన్నుడై, ఇంద్రియనిగ్రహము కలిగి, నిశ్చితస్వభావము కలవాడై, దుఃఖమునందును చలించని దృఢస్వభావము కలిగి, గురువులకు, పెద్దలకు విధేయుడై, ప్రజలకు ప్రీతిపాత్రుడై, సర్వధర్మములు తెలిసి అనుష్ఠించగల సామర్థ్యము కలిగి, సత్యధర్మపరాయణుడు, సత్పురుషుడు, పూజ్యుడు అని గొప్ప యశస్సును సంపాదించెను.

ఈ మహాకావ్యమునందు రాముని ధర్మానుష్ఠానము ఆ యా సన్నివేశములలో ఆయన కల్యాణగుణములుగా వెలుగొంది ఎటుల సర్వమానవులకు ఆదర్శప్రాయముగా చిరస్థాయిగా నిలబడెనో వర్ణించి మహాకవి మనకు అందించెను. అందు మొదటిది సత్యము.

సత్యము :

మహాకవి వాల్మీకి రాముని సత్యసంధుడు, సత్యవాది, సత్యశీలుడు, సత్యపరాక్రము డని అభివర్ణించి ఈ సత్యమునందు రాముని దృఢవ్రతమును నిరూపించెను. సత్యసంధు డనిన సత్యమైన ప్రతిజ్ఞ కలవాడు. వనవాసము చేయు రామునివద్దకు భరతుడు పౌరులను, తల్లులను, గురువైన వసిష్ఠునికూడా తీసుకొని వచ్చి నిష్కల్మషమైన భక్తిప్రపత్తులతో రాజ్యము తన కవసరము లేదని రామునికే నివేదించి ఆయనను అయోధ్యకు రావలసినదిగా ప్రార్థించెను. కుమారుని భ్రాతృభక్తికి ఆశ్చర్యచకితురాలై కైక పశ్చాత్తాపచిత్తురాలై తాను కూడ పుత్రు ననుసరించెను. వసిష్ఠుడు "ఇక్ష్వాకువంశములో జ్యేష్ఠపుత్రుడే రాజగును. అతిప్రాచీనమైన ఈ రఘువంశీయుల కులధర్మమును చెరచవద్దు. భరతుని కోరిక మన్నించు"మని రాముని ఆదేశించెను.

స్థూలముగా చూచినచో ఎవరికొరకై కైక రాజ్యము నర్థించెనో ఆ భరతుడు త్రికరణశుద్ధిగా రాజ్యపాలనయందు తిరస్కారమును వెలువరించినపుడు రాముడు రాజ్యము నంగీకరించిన దోషమునకు తావులేదు. అతని ప్రతిజ్ఞకు భంగము వాటిల్లదు. కాని రాముడు పలికిన వచనములు గమనార్హములు. "నేను నా ప్రతిజ్ఞ నుల్లంఘించి అధర్మమును ధర్మ మను వేషముతో ఆచరించను. నేను ప్రతిజ్ఞ విడిచి ప్రవర్తించినచో ఇటుపైన ఎవరికిని మంచి మార్గము నుపదేశించలేను. రాజ్యములో సత్యము ప్రధానము. సత్యముకన్నా ఉత్తమపదము లేదు. అసత్యపరు డిచ్చు హవ్యకవ్యములను దేవతలు, పితృదేవతలు అంగీకరించరు. సత్యమును, ధర్మమును, సాక్షాత్తుగా ప్రత్యగాత్మగా తలంచుచున్నాను" అని, జాబాలి పలికిన నాస్తికవాదమును ఖండించుచు సత్యప్రాశస్త్యమును, పవిత్రతను, సుదీర్ఘముగా

ఉపన్యసించి రాజ్యపాలనను తిరస్కరించి తన ప్రతిజ్ఞయందు దృఢసంకల్పము కలవాడాయెను. ఇది దేవర్షి నారదుడు తెలిపిన 'నియతాత్మా' అను రాముని కళ్యాణగుణమునకు దివ్యమైన తార్కాణము.

రాముని వనవాసము అయోధ్యను విసర్జించుట మాత్రమే కాదు. వాలివధానంతరము సుగ్రీవుని పట్టాభిషేకమునకు కిష్కింధకు రావలయునని హనుమంతు డాహ్వానించినపుడు, "నేను తండ్రి ఆజ్ఞను పరిపాలించుచున్నాను. 14 సంవత్సరములు గ్రామమున కాని, పట్టణమున కాని ప్రవేశించనని" నిరాకరించెను. అందుకు రాముడు సత్యవ్రతుడుగా, వ్రతధరుడుగా ప్రశంసించబడెను. రాముడు ప్రతిజ్ఞాధురంధరునిగా తెలుపు సన్నివేశములు ఈ కథాభాగమునందు మరికొన్ని పరికింతము.

దండకారణ్యమునందు ఋషుల కోరికపై వారిని రాక్షసుల బాధనుండి రక్షించుటకు అచట గల రాక్షసుల నందరిని సంహరింతునని రాముడు ప్రతిజ్ఞ పలికెను. అందుపై సీతాదేవి 'మనకు ఏ అపకారము చేయనివారిని హింసించుట న్యాయముకాదు. వైరములేకుండా క్రూరముగా ప్రవర్తించుట ధర్మముకాదు. కావున ఈ సంకల్పమును మానవలసిన'దని కోరెను. అందుకు రాముడు "నేను ప్రతిజ్ఞ చేసి పైగా మునులకు చేసి ఆ ప్రతిజ్ఞను నాలో ప్రాణములుండగా తప్పజాలను. 'సత్యమిష్టం హి మే సదా' - నాకు ఎపుడూ సత్యమే చాలా ఇష్టముకదా. నేను ప్రాణము నైననూ, లక్ష్మణునైనా, చివరకు నిన్నైనా విడుతును కాని ప్రతిజ్ఞను మాత్రము, విశేషించి బ్రాహ్మణులకు చేసిన ప్రతిజ్ఞను మాత్రము విడువ జాల" నని పలికెను.

రామలక్ష్మణులను ఇంద్రజిత్తు నాగపాశబద్ధులను చేసినపుడు రాముడు తన తమ్ముని దురవస్థకు చింతించుట కాక విభీషణునకు చేసిన వాగ్దానమును తలపోసి, "విభీషణుని రాక్షసరాజుగా గావింతునని చెప్పిన అసత్యవచనము నన్ను నిస్సందేహముగా దహించగల" దని వాపోయెను. రావణవధానంతరము విభీషణుని లంకారాజ్యమునకు అభిషిక్తుని చేసి కృతకృత్యునిగా భావించి "విజ్వరః" సంతాపరహితు డాయెను. ప్రతిజ్ఞాపాలనము పవిత్ర మగు వ్రతధారణగా భావించిన మహానుభావుడు రాముడు.

సత్యము మిగతా ధర్మములవలె తరతమ భేదములతో పాటించుటకు వీలులేదు. అనగా తపస్సు, దయ, శౌచము, ప్రతివ్యక్తి తన శక్తి కొలది ఆచరించవచ్చును. కాని సత్యవ్రతమునందు అటువంటి ప్రవర్తనకు తావు లేదు. కావుననే అన్ని ధర్మములకు ఇది ప్రాణము వంటిది. ఇది రాజతుల్యము. మిగతా ధర్మములు దానిని బంటువలె సేవించవలయును. కావున యోగశాస్త్రకారుడు

'సత్యప్రతిష్ఠా క్రియాయాం ఫలాశ్రయత్వమ్" అని చెప్పెను. సత్యప్రతిష్ఠ కలవారి వాక్కు అమోఘము. వారెటుల ఆశీర్వదించిన అటులగును. 'స్వర్గం ప్రాప్నుహి' స్వర్గమును పొందుము అన్నచో యాగాదికములను చేయకపోయిననూ స్వర్గమును పొందును.

జటాయువు దేహమునకు దహనసంస్కారములను చేసి తర్పణాదులను విడిచి "జపయజ్ఞాదులను చేసినవారు, ఆహితాగ్నులు భూరిదానమును చేసినవారు చేరు అత్యుత్తమలోకమునకు చేరు"మని పలికెను. ఇవి ఆశీస్సులు మాత్రమే అని మనము తలంపకుండా మహాకవి వాల్మీకి "ఆ సత్యవ్రతుని వాక్కుప్రకారము జటాయువు ఉత్తమ గతిని పొందెను" అని వక్కాణించెను.

దశరథుడు రాముని గుణములను వర్ణించుచూ 'సత్యేన లోకాన్ జయతి' అని సత్యముచే రాముడు పరలోకములను జయించెను అని తెలిపెను. అందుచే వాల్మీకి రాముని సత్యధర్మపరాయణునిగా నుడివెను. రాముని వాక్కు సత్యము, శీలము సత్యము, పరాక్రమమును సత్యమే. అందుచే 'సత్యపరాక్రమః' అని రాముని అడుగడుగునా వర్ణించెను. రాముని 'సత్యే ధర్మ ఇవాపరః' సత్యమును పాలించుటలో రెండవ ధర్మమువలె ఉండెనని, 'సత్యాత్మా' మూర్తీభవించిన సత్యముగా రాముని మహాకవి వాల్మీకి అభివర్ణించెను.

దయ :

పరదుఃఖాసహనము దయ. ఇతరుల దుఃఖమును సహించజాలకపోవుట. 'అనుక్రోశో హి సాధూనాం మహాధర్మస్య లక్షణమ్' అని నారదసంహితావాక్యము. సజ్జనుల యెడ దయ పరమధార్మికుల లక్షణము అని అభిప్రాయము. రాముడు 'దీనానుకంపీ' దీనుల యెడ జాలిచూపువాడు, 'సానుక్రోశః' దయకలవాడు, 'సాన్త్వయితా' కష్టములలో నుండువారిని ఓదార్చువాడు అని వాల్మీకి వర్ణించెను. ఈ విశిష్టగుణము రామునియందు కలదని 'వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః' - మానవులకు ఆపద కలిగిన రాముడు దుఃఖించునని తెలిపెను.

త్రికరణశుద్ధిగా ప్రాణులయెడ ద్రోహచింత లేకుండుట, దయ, దానము, శీలమున కుండవలసిన లక్షణము లని భారతమున చెప్పబడినది. అనగా అహింసా దయా దాన గుణములు మానవుని శీలవంతునిగా చేయును. అహింస ఆచరించుటకు కాని, దానశీలు డగుటకు కాని దయ ముఖ్యము. అది శీలమునకు ఆధారభూతము. రాముడు సజ్జనుల యెడ, ఆప్తుల యెడ, శత్రువుల యెడ చూపు కారుణ్యము వర్ణనాతీతము. అందుచే కారుణ్యనిధి అని పేరుగాంచెను. 'సర్వేషు కురుతే దయాం...; తే తం అనువ్రతాః' - అందరియందు దయ

చూపును, కాన అందరూ అతన్ని అనుసరింతురు అని భావము. ఇందుకు తార్కాణములుగా కొన్ని సన్నివేశములను పరిశీలింతము.

లక్ష్మణుడు ఇంద్రజిత్తుచే నాగపాశబద్ధుడై పడిపోయినపుడు, రావణుడు ప్రయోగించిన శక్తిచే మూర్ఛపోయినపుడు దీనవదనుడై, రాము డీ విధముగా ఆక్రోశించెను. - "నా తమ్ముడు యుద్ధమున నిర్జితుడై నేలబడి పొరలుచుండుట చూడవలసివచ్చినది. ఇక సీతతో ఏమి పని, నా ప్రాణముతో మాత్రము ఏమి ప్రయోజనము. భూలోకమున వెదికినచో సీతను బోలిన వనిత లభించును. కాని లక్ష్మణుని బోలిన తమ్ముడు మాత్రము లభించజాలడు."

"దేశే దేశే కలత్రాణి దేశే దేశే చ బాంధవాః,
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః."

ఈ శ్లోకము జగద్విఖ్యాతము.

యుద్ధమునకు ముందు రాముడు ఒక్కడు చేసిన తప్పునకు రాక్షసుల నందరిని చంపవలసివచ్చినది కదా అని చింతించి రావణునివద్దకు దూతను పంపి సీతను తెచ్చి శరణు పొందనిచో ఈ లోకమునంతనూ అరాక్షసము గావించెదనని తెలిపెను. అటులనే యుద్ధమును ప్రారంభించుటకు పూర్వము రాముడు సుగ్రీవసహితుడై సువేలపర్వతము నధిరోహించగా, సుగ్రీవుడు లంకాపురగోపురమున విహరించు రావణుని చూచి, వెంటనే ఆ గోపురముపైకి ఎగిరి, కొంతసేపు తీవ్రముగా రావణునితో ద్వంద్వయుద్ధమును చేసి తిరిగి వచ్చి వానరయూథమున చేరెను. అట్లు వచ్చిన సుగ్రీవుని కౌగలించుకొని రాముడు - "చాలా ప్రమాదకరసాహసమును చేసితివి. ఇట్లు ఇకముందు చేయకుము" అని తన ఆవేదనను తెలియపరచుచూ ఇట్లు పలికెను. 'నీకు ఏమైననూ హాని కలిగిన యెడల సీతతో కాని, నా తమ్ములు భరతలక్ష్మణశత్రుఘ్నులతో కాని, నా దేహముతో కాని నాకేమి పని. నేను రావణుని సపరివారముగా వధించి, విభీషణుని లంకకు పట్టాభిషిక్తుని చేసి అయోధ్యకు వెళ్లి భరతుని రాజ్యాభిషిక్తుని చేసి తదుపరి దేహమును వదలవలయునని తలంచితిని.' ఆహా! ఏమి అనన్యస్నేహభావము!

వాలివధానంతరము రాముడు సుగ్రీవునితో సమానమైన శోకము కలవాడై, దీనుడై అతనిచే ప్రేతకార్యమును చేయించెనని వాల్మీకి రాముని దయాశీలమును వర్ణించెను.

రావణుడు మొదటిసారి యుద్ధమునకు వచ్చినపుడు రాముని బాణఘాతమునకు మూర్ఛపోయెను. రాముడు వానిని విరథుని చేసి, వాని కిరీటమును ఖండించి, 'నీవు యుద్ధము చేసి అలసినావు. నేను అనుజ్ఞ ఇచ్చుచున్నాను.

లంకకు పోయి విశ్రమించి తిరిగి రథము నారోహించి రమ్ము. అపుడు నా బలమును చూపెదను' అని పలికెను. ఇది దయకు పరమావధి. తన భార్యను అపహరించిన శత్రువు యెడ ఇటువంటి దయను చూపుట సామాన్యమానవునికి సాధ్యమగునా? అందుకే లక్ష్మణుడు 'రిపూణామపి వత్సల' అని రాముని ప్రశంసించెను.

రావణుని వధానంతరము కూడా రాముని దయాగుణము ద్విగుణీకృత ముగా అభివ్యక్తమగును. విభీషణుడు రావణునకు ఉత్తరక్రియలు చేయుటకు విముఖు డైనపుడు రాముడు -

'మరణాంతాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్,
క్రియతామస్య సంస్కారో మమాప్యేష యథా తవ."

'వైరమునకు అంతము మరణము. మా పని నెరవేరినది. మరణించిన ఇతడు నీకు వలె నాకును బంధువే. కావున ఇతనికి దహనసంస్కారమును గావించుము' అని పలికెను. తనకు శత్రువైన వాని మృతకళేబరమును సముద్రములో నెట్టివేసిన పీడ పోవునని తలంపక ధర్మసమ్మతముగా మరణము తరువాత నీ కెంత బంధువో నాకును అంతే బంధువని చెప్పుట ఇతని జితక్రోధు డను దివ్యగుణమునకు నిదర్శనము. రావణునితో ఏ మాత్రము వైరము లేనివాని వలె మాట్లాడెను కావున జితామిత్రుడని చెప్పనగును. ఇందుచే రాముడు దయామయుడని కీర్తించబడెను.

తపస్సు :

మనస్సు, ఇంద్రియములను ఏకాగ్రముగా ఉంచుట, విహితధర్మాచరణము, తపస్సుకు రూఢియైన రెండర్థములు. స్వామి వివేకానంద వచించినట్లు మానవుడు బాహ్యవిషయపరుడై గాని, అంతర్ముఖుడై గాని ఏ జ్ఞానాన్ని సంపాదించాలన్నా తన మనస్సును కేంద్రీకరించుటద్వారానే సాధించగలడు. మహర్షులకు, శాస్త్రజ్ఞులకు కూడ ఇదే మార్గము. బుద్ధుడు, ప్రవక్త మహమ్మదు తపస్సు చేసినట్లు చరిత్ర కలదు. బ్రహ్మ తాను తపస్సు చేసి సృష్టి చేసినట్లు భాగవతపురాణము తెలుపుచున్నది. పురుషోత్తముడైన విష్ణువు తపోమయుడు, తపోరాశి, తపోమూర్తి, తపస్సే స్వభావముగా కలవాడు, తపస్సుద్వారానే కనుగొనవలసిన వాడని మహాకవి వాల్మీకి వర్ణించెను.

శిక్షణ, శ్రద్ధలతో తపస్సు ఆచరించవలెను. అందుచే విహితధర్మాచరణ కూడ తపస్సు క్రిందనే పరిగణింపబడెను. దీనికి శుచిత్వము సహాయపడును. శౌచమనగా బాహ్యాభ్యంతరశౌచము మరియు బ్రహ్మచర్యము. కావున ప్రతి మానవుడు బాహ్యాభ్యంతరశౌచము కలిగి బ్రహ్మచర్యవ్రత మవలంబించుచు,

మనస్సును, ఇంద్రియములను నిగ్రహించి, విహితధర్మాచరణ చేయుచు, తన శక్తికొలది తపస్సంపన్నుడు కావలెను. ఈ ధర్మాన్ని ఆచరించక ఆహారము, నిద్ర, తదితరసుఖములతో కాలము గడపువాడు పశుతుల్యుడని ఆర్యోక్తి.

రాముడు మహారాజపుత్రుడై పదహారు సంవత్సరములు పూర్తి కాక పూర్వమే కాలినడకన అరణ్యమునకు పోయి, కటికనేలపై పరుండి, ఆరు అహోరాత్రములు నిద్రలేకుండ విశ్వామిత్రుని తపోవనము రక్షించెను. విశ్వామిత్రమహర్షి తపస్సున కవధి. నాలుగు దిక్కులలో వేలాది వేల సంవత్సరములు తపస్సు చేసి "ఏష విగ్రహవాన్ తపః" మూర్తీభవించిన తపఃస్వరూపుడుగా కీర్తిపొందిన మహనీయుడు, ఈశ్వరచోదితమైన నిత్యకర్మ చేయవలెనని రాముని తెల్లవారుజామున నిద్రలేపుచు "ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్" అని పలికిన విశ్వామిత్రుని వచనము మానవునకే గాక దేవతలకు కూడ సుప్రభాతగీతముగా పరిగణించబడుచున్నది. శ్రీరాముడు నవయౌవనములో ఉండి వివాహము తదుపరి పన్నెండు సంవత్సరములు దాంపత్యసుఖ మనుభవించి, భార్యతో కూడి అరణ్యమున పదునాలుగు సంవత్సరములు బ్రహ్మచర్యవ్రత మవలంబించెను. ముందుగా సీతాదేవికూడ తాను "నియతా బ్రహ్మచారిణీ" నియమవంతురాలనై బ్రహ్మచర్యవ్రతమును అవలంబించెదనని ప్రతిజ్ఞ చేసి, అటుల ఆచరించెను. రాముడు తనకు గుహుడు సమర్పించిన వివిధ భక్ష్యభోజ్యములు నిరాకరించి, నన్ను కుశచీరాజినములు ధరించి, ఫలమూలములను భక్షించి, వనములో నివసించు ధర్మనిరతుడైన మునిగా తెలియుమని చెప్పెను. ఆతిథ్య మిచ్చినపుడు మునులు కూడ రామునకు వానప్రస్థాశ్రమమునకు తగిన ఆహారము మాత్రమే సమకూర్చిరి. రాముడు తాను విఖనసముని ప్రతిపాదించిన వాన ప్రస్థమార్గము నవలంబించుచున్నానని తెలిపెను. నాకు మరణమో, సముద్రతరణమో కలుగుగాక యని సముద్రము దాటుటకు దృఢముగా సంకల్పించి, స్నానాదులచే పరిశుద్ధుడై మనోనియమము, వాఙ్నియమము కలవాడై మూడు రాత్రులు దర్భలు పరచి, వానిపై శయనించి, సముద్రు నుపాసించెను.

అందుచే దేవర్షి నారదుడు రాముని వశి, అరిందముడు, శుచి అని ప్రశంసించెను.

ఇక స్వధర్మాచరణ కూడ తపస్సని మనము గమనించితిమి. రాముడు క్షత్రియుడు. పరిపాలనాదక్షత చూపుట క్షత్రియధర్మము. రాముడు పదివేల సంవత్సరములు ప్రాణతుల్యమైన భార్య భూగర్భమున కలిసిపోయినను, ఉపాసనాపూర్వకముగా (రామో రాజ్య ముపాసిత్వా) రాజ్యము పరిపాలించెను. తన సుఖమున కేమాత్రము ప్రాధాన్యమివ్వక చేయు స్వధర్మానుష్ఠానము తపస్సు. రాముడు ఇంత దీర్ఘకాలము శిక్షణ, శ్రద్ధ చూపుచు, రాజ్యము పరిపాలించుట

దివ్యమైన తపశ్చర్య యని చెప్పుటకు సందేహము లేదు. "రాజవంశాన్ శతగుణాన్ స్థాపయిష్యతి రాఘవః" అని దేవర్షి నారదుడు చెప్పినట్లు రాముడు క్షత్రియవంశమును నూరురెట్లు వృద్ధిపరచెను.

దానము :

దాన మన ఈవి - ఇచ్చుట - త్యాగము. ఒక వస్తువుపై గాని, ఆస్తిపై గాని తన హక్కును త్యజించి ఇతరులకు ఇచ్చుట. త్యాగశీలురు కానివారు దానము చేయలేరు. "త్యాగేనైకే అమృతత్వమానశుః" అని శ్రుతి. త్యాగము వల్లనే మానవుడు అమృతత్వము పొందును.

ఒక సంపన్నగృహస్థుడు క్రైస్తును తన కుపదేశము చేయమనగా, 'నీ ఆస్తి అంతయు విక్రయించి, బీదలకు ఇచ్చి, నాతో రమ్ము' అని చెప్పెను. వివాహము చేసికొని, సంతానము కని, ఈ లంపటలో పడుట వల్లనే మానవుడు స్వార్థపరు డగుచున్నాడని బుద్ధుడు ప్రతివానిని సన్యసించి, సంసారము లేకుండా త్యాగశీలుడు కావలెనని ఆదేశించెను.

దానము ఎంతో నియమముగా భక్తిశ్రద్ధలతో చేయవలెనని శ్రుతిశాసనము. దానాన్ని శ్రద్ధగా చేయవలెను. అశ్రద్ధ చూపించరాదు. దానాన్ని తన సమర్థత కొలది ఇవ్వవలయును. వినయముతో ఇవ్వవలయును. ప్రీతిపూర్వకముగా శుభాకాంక్షాపూర్వకముగా ఇవ్వవలెను. దానము చేయుటలో ఉత్సాహము చూపించుట దానవీర మని పేరు. అందుచే శిబి, కర్ణుడు, దధీచి దానవీరు లని ఖ్యాతి నొందిరి.

రాముడు అరణ్యావాసమునకు వెళ్ళునపుడు, తపస్సుకల బ్రాహ్మణులకు తన ధనరాశినంతయు దానము చేసెను. మహర్షి వాల్మీకి అయోధ్యాకాండలో (32 వ సర్గ) దీనిని సుదీర్ఘముగా వర్ణించెను. "దీనాన్ దానేన రాఘవః". దీనులను దానముచే సంతృప్తిపరచి, తన అధీనమున ఉంచుకొనెనని వాల్మీకి రాముని అభివర్ణించెను. "అశ్వమేధశతై రిష్ట్వా" వందలాది అశ్వమేధ యాగములను చేసి కోట్లకొలది ఆవులను, బహుసువర్ణమును, ధనమును బ్రాహ్మణులకు దానము చేసెను.

త్యాగము, దానము పర్యాయపదములుగా ఉపయోగించినను త్యాగము దానము కన్న ఉత్కృష్టమైన గుణము. రాముడు దానశీలుడే కాక త్యాగశీలుడు కూడ. తండ్రి తనకు రాజ్యాభిషేకము చేయనున్న విషయము తమ్మునకు తెలియజేయుచు - "లక్ష్మణా! నాతో నీవు ఈ భూమిని పరిపాలించుము. నిన్నుకూడ ఈ రాజ్యలక్ష్మి వరించినది. నే నీ జీవితమును గాని, రాజ్యమును

గాని కోరుకొనుట నీ కొరకు మాత్రమే యని పల్కెను. లక్ష్మణుడు - భరతుడు సైన్యసమేతుడుగా అరణ్యములోనున్న తమవద్దకు వచ్చుట చూచి అతనిపై అపోహపడగా, అతనిని మందలించి రాముడు "భరతుడు, నీవు, శత్రుఘ్నుడు అనుభవించని ఏమాత్రపు సుఖము నాకు కలిగినను దానిని అగ్ని భస్మము చేయుగాక" అని తెలిపెను. కైకతో రాముడు - "నాహ మర్థపరో దేవి! లోక మావస్తు ముత్సహే, విద్ధి మామృషిభిస్తుల్యం కేవలం ధర్మ మాస్థితమ్" - నేను ధనప్రదానుడను కాను. లోకమర్యాదను అనుసరించవలెనని మాత్రమే కోరుచున్నాను. కేవలము ధర్మమవలంబించిన నన్ను ఋషితుల్యునిగా తెలిసికొమ్ము" అని పలికెను. తన వనవాసమునకై దుఃఖించు తండ్రితో "నీ వసత్యవంతుడవు కాకూడదని నేను కోరుచున్నాను. నీ యెదురుగా సత్యముపైనను, పుణ్యముపైనను ఒట్టుపెట్టి చెప్పుచున్నాను. నా కీ రాజ్యమునందు కాని, సుఖమునందు కాని, సీతయందు కాని, ఈ సకలభోగములందు కాని, జీవితమునందు కాని కోరిక లేదు" అనెను.

మిగతా కళ్యాణగుణములు ఉజ్జ్వలముగా ప్రకాశించిన కొన్ని ఘట్టముల పేర్కొందుము -

అదీనాత్మత :

ఎంత దుఃఖమునందును కలత చెందని మనస్సు కలవాడు. రాత్రి ఉపవాసముండి రాజ్యాభిషేకమునకు సిద్ధపడిన రాముడు, సుమంత్రుని ద్వారా చేరిన వార్తవలన తండ్రిని చూచుటకు వెళ్ళగా కైక "భరతునకు రాజ్యాభిషేకము చేయవలెను. నీవు వెంటనే దండకారణ్యము వెళ్ళవలెను అని రాజు కోరినా" డని చెప్పెను. మరణశాసనసమాన మయిన ఈ మాటలు విని రాముడు ఏమియు వెత చెందలేదు. ఈ సన్నివేశముచే ఆయన శోభ ఏమియు తగ్గలేదు. యోగీశ్వరునకు వలె చిత్తవికారము కలుగలేదు. ముఖమున ఎట్టి మార్పును గోచరింపలేదు. మరియు తనకు సహజమైన హర్షము విడువలేదు. వెంటనే ప్రయాణమునకు సిద్ధమయ్యెను. ఇది అదీనాత్మకత అను దివ్యగుణమునకు తార్కాణము.

వాగ్మిత, ప్రతిభ :

రాముడు వాగ్మి, ప్రతిభావంతుడు అని దేవర్షి నారదుడు నుడివెను. వాగ్మిత యనగా - శాస్త్రజ్ఞానము కలిగి, ఎదుటివారిని నిరుత్తరులను చేయువిధముగా మాటలాడుట. ప్రతిభ అనగా సమయస్ఫూర్తి కలిగి, ఉత్తరోత్తరయుక్తులు తెలిసి ఎదుటివారిని వాదించి జయించు సామర్థ్యము. ఈ రెండును మేధకు

సంబంధించినవి. ఈ గుణములచే రాముడు శోభించిన సన్నివేశములు కొన్ని కలవు. మొదటిది వాలి మరియొకరితో యుద్ధము చేయు తన్ను అన్యాయముగా చంపినావని దూషించినపుడు రాముడు యుక్తియుక్తముగా, సప్రమాణముగ తాను చేసినది ధర్మవిరుద్ధము కాదని సమాధానము చెప్పెను. అందుకు వాలి సమ్మతించి, తన తప్పు క్షమించమని కోరెను. జాబాలి - 'భరతుడు సమర్పించిన రాజ్యము స్వీకరించుము. ధర్మము పేర అనవసరమైన కష్టముపాలు కావల' దని చెప్పినను రాముడు సహేతుకముగా ధర్మనిరతి, సత్యసంధతల ప్రాముఖ్యమును సుదీర్ఘముగా, యుక్తియుక్తముగా ఉపన్యసించెను. అందుచే జాబాలి 'నిన్నయోధ్యకు మరలించుటకు అట్లు చెప్పితిని' అని రామునితో తిరిగి అనునయపూర్వకముగా మాటలాడవలసి వచ్చినది.

అటులనే విభీషణుడు శరణు వేడినప్పుడు వానరులలో పెద్దలందరు వివిధమైన అభిప్రాయము వెల్లడిచేసి, వానికి ఆశ్రయమిచ్చుట శ్రేయస్కరము కాదని నుడివిరి. అందుకు రాముడు శరణాగతరక్షణము, మానవునికి దాని ప్రాముఖ్యము సనాతనమైన ఉపాఖ్యానములతో సహా తెలిపి ఒడబరచెను. ఈ సన్నివేశములు రాముని పై కళ్యాణగుణములకు చక్కని తార్కాణములు.

### స్మృతిమత్త్వము :

రాముడు జ్ఞప్తి గలవాడు, తెలిసిన విషయమును మరువనివాడు. కైక కోరిన వరములకు సుమంత్రుడు, వసిష్ఠుడు కూడ ఆమెను తీవ్రముగా నిందించి 'కులపాంసని' అని దూషించిరి. రాముడు భరతునితో ఈ కోర్కెలు ధర్మసమ్మతమే. మన తండ్రి పూర్వము నీ తల్లి వివాహసమయమునందు ఈ రాజ్యము ఆమె కుమారునకే ఇచ్చెదనని నీ మాతామహుని ముందు ప్రతిజ్ఞ చేసెను. పైగా మన తండ్రి ఈమెకు కూడా వరము లిచ్చెనని చెప్పి ఎవ్వరూ ప్రస్తావించని చాలకాలము క్రింద జరిగిన విషయము వెలువరించి, అందరిని నిరుత్తరులను చేసెను. మరియు శరణాగతరక్షణప్రశస్తిని పేర్కొనునప్పుడు చాల పురాతనమైన కపోతము కథ, కండుమహాముని తెలిపిన ధర్మముల నుదాహరించెను. ఇది స్మృతిమాన్ అను దివ్యగుణమునకు తార్కాణము.

### ధర్మజ్ఞత, వైచక్షణ్యము :

రాముడు ధర్మసూక్ష్మము తెలిసినవాడు. విచక్షణాజ్ఞానసంపన్నుడు. రాముడు తండ్రి ఆజ్ఞ ప్రకారము అరణ్యమునకు వెళ్ళుచున్నానని తెలుపగా చాలా దుఃఖము నొంది కౌసల్య, 'నీకు తండ్రి ఏ విధముగా పూజ్యుడో, తల్లినగు నేనుకూడ అట్లే పూజ్యురాలను. నేను నీకు అనుమతి ఇచ్చుటలేదు. నీవు

అడవికి వెళ్ళవద్దు' అని పలికెను. ఇచట చాలా క్లిష్టమైన ధర్మనిర్ణయము చేయవలసియున్నది. 'మాతృదేవో భవ, పితృదేవో భవ' అని తల్లినే ముందు శ్రుతి ప్రస్తావించెను. తల్లియు, తండ్రియు విభిన్నమైన శాసనములు చేసినపుడు ఎవరి శాసనము పాటించవలెను? అందుకు రాముడు - 'దశరథుడు నీకు భర్త, నాకు తండ్రి, కావున నీకును అతడు ప్రభువు. అతడు రాజు కావున నీపైనను నాపైనను ఆయనకు అధికార మున్నది. అందుచే మనమిద్దరము ఆయన శాసనము పాటించవలె'నని ధర్మనిర్ణయము చేసెను. ఇది అతని విచక్షణాజ్ఞానమునకు తార్కాణము.

వశ్యత :

గురుజనులకు లోబడి ఉండువాడు. రాముడు శివధనుర్భంగము చేయగానే జనకుడు సంతసించి, సీతను రామున కిచ్చుటకు బంగారు జలకలశము గ్రహించెను. అందుకు రాముడు తన తండ్రి, ప్రభువైన దశరథమహారాజు అభిప్రాయము తెలియకుండ సీతను స్వీకరించుటకు నిరాకరించెను. అందుకై జనకుడు. దశరథమహారాజును పిలిపించి, ఆయన సమ్మతి బడసి, సీత నిచ్చి వివాహము చేసెను. పెద్దల యెడ వినయము చూపుచు, వారికి లొంగియుండి కార్యనిర్వహణము చేయుటచే 'వశ్యు'డని రాముడు శ్లాఘించబడెను.

నీతిమత్త్వము :

'నయతి ఇతి నీతిః' - గమ్యము చేర్చునది. ప్రతివ్యక్తి తాను చేరదలచు గమ్యమును బట్టి అది మారును. రాజకీయవిషయమైన రాజనీతి, సామాన్యవిషయమైన సమస్యాపరిష్కారమును తెలుపును. రాజధర్మము ధర్మమువలె త్రికరణశుద్ధిగా ఉండవలసిన అవసరము లేదు. అది విజయవంతముగా కార్య సాధనమార్గమును తెలుపునది. పంచతంత్రము, హితోపదేశము, నీతిశాస్త్రములు, జీవితమున మానవుడు వివిధసమస్యలను ఎట్లెదుర్కొనవలయునో తెలుపును.

వాలి భారతావనిలోని సమస్త వానర భల్లూకములకు రాజు. వానిపై యుద్ధము ప్రకటించినచో రాముడు యుద్ధముచేసి వారందరిని చంపవలసివచ్చును. తనకు రావణునితో జరుగబోవు యుద్ధమునందు రాముడు ఏ విధమైన సైన్యము లేనివాడగును. కావున ఈ విషయమున ధర్మమార్గము కన్న నీతిమార్గము శ్రేయోదాయకము. అది రాజధర్మము కూడ. మరియు వ్యక్తిగతమైన నీతిధర్మములు రాజకీయవ్యవహారమును అనుసరించరాదు. కావున వాలిని ఒక్కనిని చంపి, సర్వవానరభల్లూకరాజ్యమునకు సుగ్రీవుని ఏకచ్ఛత్రాధిపతిగా చేయుట రాముని

దివ్యమైన నీతిజ్ఞతకు ఉదాహరణము.

స్వజనరక్ష :

రాముడు స్వజనులను రక్షించు స్వభావము కలవాడు. దీనికి దివ్యమైన ఉదాహరణము రాముడు యుద్ధానంతరము ఇంద్రుని అభీష్టప్రకారము కోరిన వరము - 'నా నిమిత్తమై యుద్ధమున మృతినొందిన వానరులు, భల్లూకములు మరల బ్రతికి, బాధలేక, గాయములు లేక, ఎప్పటి యట్లు బలపరాక్రమసంపన్నులై యుండవలెను. వారు నివసించు స్థలములయందు కాలముకాని సమయమందు కూడ ఉత్తమములైన ఫలమూలములు కలుగవలయును. మరియు నదులు నిర్మలమైన జలము కలిగియుండవలయును.' అందుకు దేవేంద్రుడు సంతోషించి అతడు అడిగినట్లు వరము ప్రసాదించెను. ఆయన స్వజనులు ధర్మమార్గమునుండి ఏ మాత్రము తొలగకుండ రక్షించుట, అవసరమైన శిక్షించుట కూడ చేయును.

లక్ష్మణుడు భరతుని విషయములో అపోహ పడి, తమపై యుద్ధమునకు వచ్చుచున్నాడని, రాముడు సన్నద్ధుడు కావలెనని హెచ్చరించినపుడు, రాముడు లక్ష్మణుని అపోహను తీవ్రముగా ఖండించి, "భరతుని గురించిన అప్రియవాక్యము లన్నియు నన్ను గూర్చి చెప్పినట్లగును. నీకు రాజ్యము కావలెననిన భరతునితో చెప్పి ఇప్పించెదను. ఎంతటి ఆపదయందైనా పుత్రులు తండ్రిని చంపుదురా? సోదరుడు తన ప్రాణసమానుడైన సోదరుని చంపునా?" అని తెలిపి లక్ష్మణుని సిగ్గుతో క్రుంగిపోవునట్లు చేసెను. భరతుని కోరికపై రాముడు తిరిగి రాజ్యము స్వీకరించుటకు నిరాకరించగా, భరతుడు రామునిముందు దర్భలు పఱచి, ప్రాయోపవేశమునకు ఉపక్రమించెను. అందుకు రాముడు - 'నీవు క్షత్రియుడవు. బ్రాహ్మణునకు తగిన ఇట్టి ప్రాయోపవేశము చేయుట అనుచితము. వెంటనే దీనిని విరమించు' మని శాసించెను.

యుద్ధానంతరము విభీషణుడు రాముని ఆజ్ఞ ప్రకారము సీతను స్నానమాచరింపజేసి, సాలంకృతను చేసి, ఆయనవద్దకు తీసికొని వచ్చునపుడు వానరులందరు ఒక్కసారిగా ఆమెను చూచుటకు ముందుకు రాగా, కొంతమంది భల్లూకవీరులు, వానరులు బెత్తములు పట్టుకొని వారిని తొలగించిరి. అటుల వారిని తొలగించునప్పుడు పెద్ద ధ్వని చెలరేగెను. వానరుల నిట్లు తరుముట, అందుపై వారు పెద్దగా అరచుట చూచిన రామునకు తీవ్రమైన కోపము వచ్చినది. వెంటనే కనుల నిప్పులు రాలునట్లు విభీషణుని చూచి, తిరస్కారపూర్వకముగా ఇట్లు పలికెను. - "నీవు నన్నుకూడ లక్ష్యము చేయక ఈ జనులందరిని ఇట్లు శ్రమపెట్టుచున్నావు. వీరిని తొలగించు ప్రయత్నము నిలుపుము. వీరంతా మన ప్రజలు కాని వేరుకాదు. స్త్రీకి సదాచారమే ఆవరణము కాని గృహములు,

వస్త్రములు, ప్రాకారములు, తెరలు మొదలగునవి ఆవరణలుకా"వని విభీషణుని నిరసించెను.

స్వజనులను ఆపదయందు రక్షించుట ఎంత అవసరమో అధర్మమునుండి రక్షించుట కూడ అంత అవసరమే.

సాధుత్వము :

రావణుడు మొట్టమొదటిసారిగా రామునిపై యుద్ధమునకు వచ్చినపుడు, వాని రథము, గుఱ్ఱములు, ఛత్రము, సారథి, ఆయుధములు, కిరీటములను ఖండించి, లంకకు పోయి కొంత విశ్రమించి, మరియొక రథమెక్కి రమ్మని పలికెను. తన భార్యను అపహరించి, తన స్వాధీనములో నుంచుకొని, యుద్ధము చేయువానికి విశ్రాంతి కలుగజేయుట సత్పురుషులు తప్ప మానవమాత్రులు అనుసరించగల ధర్మము కాదు. కావున రాముని గూర్చి సాధు వను మహర్షివచనము పరమసత్యము.

సజ్జనాభిగమ్యత :

సర్వనదులు సముద్రుని చేరునట్లు, సత్పురుషు లందరు రాముని వద్దకు వచ్చి చేరెడివారు. "యశ్చ రామం న పశ్యేత్తు యం చ రామో న పశ్యతి, నిందితః సర్వలోకేషు స్వాత్మాప్యేనం విగర్హతే" - రాముని చూడని వారిని, రామునిచే చూడబడని వానిని లోకు లెల్లరు నిందింతురు. అతడు తనను తనే నిందించుకొనును. రాముడు నాలుగు వర్ణములకు చెందిన సర్వజనులయెడలను వయోవృద్ధులందును దయజూపెడివాడు. కావున వారంద రతనిపై అమితమైన ప్రేమ కలిగియుండెడివారు.

బుద్ధిమత్త్వము; జ్ఞానసంపత్తి :

రాముడు సర్వజ్ఞుడు. జ్ఞానసంపన్నుడు. రాముడు పిత్రాజ్ఞ ప్రకారము అరణ్యమునకు పయనమగుట లక్ష్మణుడు చూచి సహించక 'ఈ కుట్ర మన మెదుర్కొనవలెను. అవసరమైన దశరథుని బంధించెదను. లేక వధించెద' నని పలికెను. దానికి రాముడు - 'ఇచ్చిన రాజ్యము వెనుకకు తీసికొని నన్నరణ్యమునకు పంపుటకు దైవమే కారణమని తెలియుము. కాకున్న భరతునియందు, నా యెడల ఏ భేదము చూడని కైక ఒక సామాన్యస్త్రీ వలె ఉగ్రమైన మాటలు పలికి, భర్తయెదుట నాకు బాధ కలిగించునా? ఇపుడు నా యుందను, కైక యందును దైవవైపరీత్యము వచ్చిపడినది. ఇది స్పష్ట' మని తెలిపెను. ఇది దైవనిర్ణయమని కథాంతమున మనకు దశరథుని ద్వారా వాల్మీకి వినిపించెను.

సీత అగ్నిపరీక్షాసమయమున దేవతలతోపాటు స్వర్గమునుండి వచ్చిన దశరథుడు - 'నాయనా ! దేవతలే రావణవధ కావలెనని అప్పుడు నీ పట్టాభిషేకమునకు విఘ్నము కావించిరని నాకిప్పుడు తెలిసినదని చెప్పెను. రాముడు వచించినట్లు దైవమే కైకకు ఈ బుద్ధి పుట్టించెననెడు మాట సత్యముగా నిరూపింపబడెను. అటులనే అగ్నిహోత్రుడు మనుష్యాకారమున సీతాదేవిని చితినుండి పైకి తెచ్చి 'ఈమె పాపరహిత; ఈమెను స్వీకరించు'మని తెలిపెను. రాము డందుకు సమ్మతించి, ఈమె పవిత్రత నాకు తెలియును. సత్యము వెల్లడియగుటకు ఈమె అగ్నిని ప్రవేశించుచుండగా ఉపేక్షించితి' నని తెలిపెను. ఈ విషయమును కూడ దశరథుడు ధ్రువపరచుచు సీతతో - 'నిన్ను నిందించి పరిత్యజించినానని చెప్పెనని రామునిపై కోపము చూపవలదు. నీ చారిత్రము పరిశుద్ధముగా ఉండుటకై నీ మేలు కోరియే రాము డిట్లు చేసె' నని తెలిపెను.

ఆర్యత్వము, యశస్వీత :

రాముడు పూజ్యుడు. కీర్తిసంపన్నుడు. రామునిపై గల గౌరవమును పురస్కరించుకొని, ఆయన నిర్ణయమును ప్రతిఘటించుటకు గాని, దానిని పునరాలోచన చేయుమని చెప్పుటకు గాని, ఎంత సన్నిహితులైనవారు కూడ సాహసించలేరు. సీతాపహరణముచే చాల పరితపించి, ఎంతో కష్టముమీద రావణుని సంహరించి, తన ఆదేశానుసారము విభీషణునిచే తీసికొనిరాబడి, తన యెదుట నిలబడిన సీతను తృటిలో పరిత్యజించి - "నీతో నాకు పని లేదు. నీ ఇష్టమువచ్చిన స్థలమునకు పో"మ్మని పలుకు దారుణవచనము విని, ఆమె అగ్నిప్రవేశమునకు సిద్ధముకాగా, ప్రాణసముడగు లక్ష్మణుడు, సన్నిహితులైన సుగ్రీవుడు, విభీషణుడు, వృద్ధులైన జాంబవదాదులు నిస్సహాయులై భయసంభ్రమములతో ఏ విధమైన అడ్డు చెప్పలేక కట్టుబడి యుండుటకు కారణము అయన యెడల గల పూజ్యభావమే. ధర్మనిర్ణయమున ఆయనకు సాటి మరెవ్వరూ లేరని, ఆయనను పరమపూజ్యునిగా ప్రతివ్యక్తియు భావించెడివాడు.

రాముడు యువరాజు కావలెనని పౌరులు కోరుటకు కారణము తెలియవలెనని దశరథుడు కోరగా వారు రాముని శీలము, వృత్తము సుదీర్ఘముగా వర్ణించి చెప్పిరి. రాముడు రాజుకాక పూర్వమే దివ్యమైన శీలసంపద కలవాడుగా ప్రకాశించెను. సీతాదేవి అగ్నిపరీక్షా సమయమున సర్వదేవతులు వచ్చి రాముని - 'నీవు సమస్తలోకములకు కర్తవు; సర్వోత్తముడవు. జ్ఞానులలో మేటి' వని ప్రశంసించగా రాముడు - 'నేను దశరథుని కుమారుడను. రాముడను. మానవునిగా తలంచుచున్నా' నని చెప్పెను. 'ఈ బ్రహ్మదేవుడు నా జన్మవివరము తెలుపుగాక' అని పలికెను. అందుపై బ్రహ్మదేవుడు రాముని - 'నీవు సాక్షాత్

నారాయణుడవు. స్వయంప్రకాశుడవు. సీతాదేవి లక్ష్మీదేవి' అని పలికెను. ఇటుల మానవునిగా చరించు వ్యక్తి సర్వజగద్రక్షకుడుగా ముల్లోకముల వ్యాపించిన శాశ్వతకీర్తిసంపన్నుడుగా అయ్యెను.

రాముని కళ్యాణగుణము లనంతములు. అందుచే దేవర్షి నారదుడు - 'బహవో దుర్లభాశ్చైవ' అని నుడివెను. కావున మరి రెండు కల్యాణగుణములను మాత్రము పేర్కొందుము.

బ్రహ్మణ్యత్వము; శరణ్యత్వము :

'బ్రహ్మణ్యశరణ్యత్వాదయో మహాన్తో గుణాః' అని భాగవతవ్యాఖ్యానకర్త శ్రీధరుని వచనము. బ్రహ్మణ్యగుణ మనగా వేదాధ్యయనపరులయిన బ్రాహ్మణులను రక్షించుట, పోషించుట, వారి శ్రేయస్సును సదా కాంక్షించుట. దండకారణ్యవాసులైన ఋషులు మమ్ము రాక్షసుల బారినుండి రక్షింపుమని ప్రార్థించగా రాముడు - 'మీరు నన్ను ప్రార్థించకూడదు. ఆజ్ఞాపించవలెను' అని చెప్పి దండకారణ్యములోని రాక్షసు లందరినీ సంహరించుటకు ప్రతిజ్ఞ చేసెను.. ఈ విషయముపై సీతాదేవి మనకు అపకారము చేయని వారిని గురించి క్రోధము పొందుట ధర్మము కాదనగా, అందు కంగీకరించక రాముడు నా ప్రాణములనైనను, లక్ష్మణునైనను, నిన్నైనను విడచిపెట్టెదను కాని బ్రాహ్మణులకు చేసిన ప్రతిజ్ఞను విడువజాలనని తెలిపెను.

ఇంక శరణ్యతాగుణము. విభీషణుని మనలో చేర్చుకొనుట ప్రమాద భూయిష్ఠమని వానరవీరులందరు నుడివిరి. అందుకు రాముడు 'శరణని వచ్చినవానిని విడువజాలను. ఈ ధర్మము సత్పురుషులకు ప్రశంసనీయ' మని ఇతిహాసపూర్వకముగా ఆ ధర్మమును వివరించి, "ఒక్కమారు శరణాగతుడను, నీవాడను అని చెప్పియుండెనేని, ఆతనికి ఎవ్వరివలన ఏ భయమున్నను ఆ భయము లన్నియు తీర్చెదను. ఇది నా వ్రత" మని పలికెను. ఈ శ్లోకమును నిష్ఠాపరులైన వైష్ణవులు ప్రార్థనశ్లోకముగా పరిగణింతురు.

ఇంతవరకు రాముని శీలమును గురించి స్థూలముగా పరిశీలించితిమి. మానవునకు శీలము, వృత్తము రెండును ఆవశ్యకములు. వృత్తము అనగా బాహ్యప్రవర్తన. ఇది శీలమునకు శోభ చేకూర్చును. రాముని శీలముతో బాటు వృత్తముకూడా గమనార్హము. ఇవి కూడ ఆయన దివ్యమైన కల్యాణగుణములు.

రామః స్మితపూర్వభాషీ : ముందు చిరునవ్వు, తర్వాత

మాట్లాడుట చేయువాడు.

| | | |
|---|---|---|
| పూర్వభాషీ | : | ఎవరు కనపడినను తానే ముందు మాట్లాడువాడు. |
| మధురభాషీ, ప్రియంవదః | : | మధురముగా మాటలాడువాడు, ప్రియముగా మాటలాడువాడు. |
| మితభాషీ | : | మితముగా మాటలాడువాడు. |
| నాసద్గ్రాహీ | : | మొండి పట్టుదల కలవాడు కాదు. |
| న దుర్వచాః | : | చెడ్డమాటలు మాట్లాడువాడు కాదు. |
| నిభృతః | : | అణకువగా ఉండువాడు. |
| పరుషం నోత్తరం ప్రతిపద్యతే | : | పరుషవాక్కులకు సమాధానము చెప్పెడివాడు కాదు. |
| న విగృహ్యకథారుచిః | : | కలహమును గూర్చి మాట్లాడువాడుకాదు. |
| ఏకేన ఉపకారేణ తుష్యతి | : | ఏ చిన్న ఉపకారము చేసినను ఎంతో సంతోషించెడివాడు. |
| న సరతి అపకారాణాం శతమపి | : | నూరు అపకారములు చేసిననూ వాటిని స్మరించెడివాడు కాదు. |
| న చావమంతా భూతానామ్ | : | ఏ ప్రాణినీ అవమానించేవాడు కాదు. |
| కళ్యాణాభిజనః | : | మంచివారితో సాంగత్యం చేసేవాడు. |
| వృద్ధానాం పరిపూజకః | : | వృద్ధులకు ఎదురేగి గౌరవించెడివాడు. |
| బహుశ్రుతానాం వృద్ధానాం బ్రాహ్మణానాముపాసితా | : | అధికశాస్త్రవేత్తలైన పెద్దలైన బ్రాహ్మణుల నుపాసించెడివాడు. |
| చరణౌ ववందే జగ్రాహోవాహ్య | : | తల్లిదండ్రులకు, గురువులకు, పెద్దలకు పాదములకు నమస్కరించెడివాడు. రాముడు చతుష్పథములు, చైత్యములు దేవాలయములు, ప్రదక్షిణపూర్వకముగా దాటుచుండెడివాడు. |
| నిత్యం కుశలం పరిపృచ్ఛతి | : | పౌరులకు, స్వజనులకు కుశలప్రశ్న వేసెడివాడు. |
| ... భృశం భవతి దుఃఖితః | : | ఎవరికైన ఆపద వచ్చినపుడు మిక్కిలి |

దుఃఖించెడివాడు.

... పితేవ పరితుష్యతి : ఎవరికైన అభివృద్ధి కలిగినపుడు తండ్రివలె సంతోషించువాడు.

అరణ్యావాసమునకు వెళ్ళునపుడు కోసలదేశము దాటగానే, అయోధ్య వైపు తిరిగి పట్టణమునకు నమస్కరించెడివాడు. తిరిగి యుద్ధానంతరము వచ్చునపుడు అయోధ్యకు నమస్కరించి, సీతాదేవిని నమస్కరించుమని చెప్పెను. జీవనదులు దాటునపుడు నదులకు నమస్కరించెడివాడు. వటవృక్షములకు సీత, తాను పూజ చేసెడివారు. రథము ఆరోహించునపుడు రథమునకు ప్రదక్షిణము చేసి ఆరోహించువాడు.

ఈ ప్రవర్తనకు ప్రజలు ముగ్ధులై ఆయన ఆరోగ్యమును కోరెడివారు. వృద్ధమహిళలు, యువకులు ప్రాతఃకాలమున సాయంత్రము ఆయన అభివృద్ధికి దేవతలను ప్రార్థించెడివారు.

రాముని సంసేవనము వలన ఆయన ధర్మపత్ని సీతాదేవి, ఆయన సోదరులు, ధర్మాచరణయందు శ్రీరాముని మించినారా యనెడి అభిప్రాయము దృఢపడును. అందు ముందు పేర్కొనవలసినది సీతాదేవి. దాంపత్యపవిత్రత ప్రస్తావనలో ఈ విషయము కొంత పేర్కొంటిమి. ఇపుడు ధర్మానుష్ఠానములో ఈమె రామున కేమియు తీసిపోదు. పైగా మించునని తెలియజేయు సన్నివేశములు పేర్కొందుము. చేతికందిన రాజ్యము పోయినపుడు మామగారిని ఒక్కమాట అనలేదు. తాను వెంటనే రామునితో వనవాసమునకు సిద్ధమైనది. రాముని తిరస్కారమునకు దిగ్భ్రాంతి చెంది, అగ్నిపరీక్షలో నెగ్గి ముల్లోకములలో తన ఖ్యాతిని వ్యాపింపజేసెను. రావణుని బుగ్గిచేయగల సమర్థత కలిగియుండియు, తన తపస్సును రక్షించుకొనుటకు రామాజ్ఞ లేనందున ఓర్పు వహించిన యశోధనురాలు. హనుమంతుడు ఈమెను మొట్టమొదటిసారి చూచినప్పుడు రామున కీమె తగినది. రాము డీమెకు తగినవాడు అని తలపోసి, మూడులోకములపై అధికారము గొప్పదా, జనకుని కూతురైన సీతను సంపాదించుట గొప్పదా అనగా, మూడులోకములపై అధికారము సీతలో పదునాఱవపాలుకు కూడా సరిపోదని తెలిపెను. ఇటువంటి సాధ్వీమణిని రాముడు ఉత్తరకాండలో తిరిగి ఆమెకు చెప్పకుండా వనవాసమునకు పంపి గృహమునుండి బహిష్కరించినపుడు లక్ష్మణునితో ఆమె రామునకు పంపిన సందేశము గమనార్హము - 'నీకు లోకనిందవలన కలిగిన అపకీర్తి ఏది కలదో దానిని నేను కూడ పోగొట్టవలసియున్నది. నీవు సోదరుల యెడల యెట్లుందువో

పౌరజానపదులగు జనులందరితో ఎల్లపుడు అటులనే ఉండు'మని చెప్పెను. ఆమె తన దురవస్థకు చింతించక రామునికి కలిగిన అపకీర్తి బాపుటకు తాను బాధ్యత వహించుట, రాముడు ధర్మానుష్ఠానములో అప్రమత్తుడై ఉండవలెనని హెచ్చరించుట ఆమె ధర్మనిరతికి పరమావధి.

భరతుడు :

ఇక భరతుని విషయమునందు రాముడే సాక్షి. భరతుని శీలము తలచుకొని రాముడు ముగ్ధుడై పులకితుడయ్యేడివాడు. శత్రుఘ్నుడు మంథరను చంపుటకు పూనుకొన్నపుడు వానిని వారించి, 'ఈ విషయము రామునకు తెలిసిన నిన్ను, నన్ను రాముడు పలుకరించడు. అటుల కాకున్న పాపాత్మురాలైన కైకను నేను చంపి యుండెడి వాడను' అని భరతుడు తెలిపెను. భరతుని వాల్మీకి "ధర్మాత్మానం యశస్వినం" అని వర్ణించెను. మహాకవి భాసుని ప్రతిమానాటకంలో రాముడు భరతుని "నేను పదునాలుగేండ్లు వనవాసము చేసి, పితృాజ్ఞాపరిపాలన మొనర్చి ఏ యశస్సును పొందవలెనని ఊహించుకున్నానో అంతటి యశస్సును లేదా అంతకన్న అధికయశస్సును ఈ క్షణములో, ఈ ఒక్కమాటలో రాజ్యతిరస్కారముచే ఆర్జించుకొన్నావు" అని పలికిన వచనములు పరమసత్యములు.

రాముడు తన సత్యసంధతకు లోపము వచ్చునని రాజ్యము తిరస్కరించెను. భరతుడు జ్యేష్ఠుడు ఉండగా తాను రాజ్యము పాలించుట ధర్మముకాదని నిశ్చయముతో ప్రకటించెను. అయితే ఈ ధర్మసమరములో ఎవరు గెలిచిరి? గెలుపు భరతునిదే అని చెప్పక తప్పదు. భరతుడు నీవు కాకున్న నీ పాదుకలే రాజ్యము చేయవలెననగా, అందు కంగీకరించి రాముడు తన పాదుక లీయగా వానిని తలపై దాల్చి, నందిగ్రామము చేరి, సమస్తరాజ్యకార్యములు వానికి విన్నవించుచు, వానికి ఛత్రచామరములు పట్టుచు రాముడు రాజ్యము తనవద్ద ఇల్లడముగా ఉంచినటుల భావించి రాజ్యపాలన నడిపెను. ఈ భ్రాతృవత్సలత, భక్తి, మానవునకు శిరోధార్యములు. ఇటువంటి సన్నివేశములు 'నభూతో న భవిష్యతి'.

ఇక లక్ష్మణుని విషయమా - రామునకు లక్ష్మణుడు "బహిఃప్రాణ ఇవాపరః" బయటనుండు రెండవ ప్రాణమువలె నుండెనని వాల్మీకి మహర్షి వర్ణించెను. అటులనే లక్ష్మణుడు రాముని తన ప్రాణముకంటె ఎక్కువ ప్రీతిగా సేవించెను. లక్ష్మణుడు ఎవడైనను ధర్మమును అతిక్రమించినపుడు, ధర్మమునకు అపజయము కలిగినపుడు సహించలేడు. తీవ్రకోపము నొందును. కాని రామునాదేశానుసారము వెంటనే నిగ్రహము వహించును. రాముడు

అరణ్యములో కాని, అగ్నిలో కాని ప్రవేశించవలసి వచ్చినపుడు ముందు తాను ప్రవేశింతునని తెలిపెను. "రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్" అను తల్లి ఆదేశము పరిపాలించినట్లు రాముడు, సీతయు కూడా నుడివిరి. అరణ్యవాసములో రాముడు లక్ష్మణుని సేవకు ముగ్ధుడై, 'నీవు నాకు రక్షకుడుగా ఉండగా, తండ్రి మరణించనట్లే భావించుచున్నా' ననెను. సీతాదేవి కూడా హనుమంతునితో 'రాముడు లక్ష్మణుని చూచికొని, స్వర్గస్థుడైన తండ్రిపై బెంగ పెట్టుకొనలే' దని తెలిపెను. రామునికి జరిగిన అన్యాయము దైవవిలసితమని చెప్పిన రాముని వచనములు లక్ష్మణునకు అంగీకారయోగ్యముగా తోచలేదు. అందుచే సుమంత్రునితో 'నేను దశరథుని తండ్రిగా పరిగణించుట లేదు. నాకు సోదరుడైనా, ప్రభువైనా, బంధువైనా, తండ్రియైనా రాముడే' అని చెప్పెను. రామునితో వనవాసమువలన ప్రజలు లక్ష్మణు డొక్కడే సత్పురుషుడు "ఏకః సత్పురుషో లోకే" అని శ్లాఘించిరి.

ఈ అనన్య సేవాభక్తికి రాముడు ముగ్ధుడై లక్ష్మణుడు మూర్ఛపోయినపుడు "దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః, తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః" అని హృదయవిదారకముగా విలపించెను. లక్ష్మణునికి రాముడు సర్వస్వము. ఆయన ఆజ్ఞ శిరోధార్యము. దాని ధర్మాధర్మ విషయములు చర్చించ నవసరము లేదు. అతని ఆజ్ఞ ఎంత దుర్భరమైనను చేయుటకు తాను సిద్ధమే. అందుచే సీత అగ్నిప్రవేశమునకు తానే చితిని పేర్చెను. సీతాదేవిని రామజ్ఞ ప్రకారము రెండవసారి వనవాసమునకు తానే పంపెను. యుద్ధమునందు రామాజ్ఞ ప్రకారమే తాను ఇంద్రజిత్తును చంపుచున్నానని, రాముని ధర్మమువల్లనే వాడు సంహరింప బడుచున్నాడని, తన శక్తికాదని తెలియజేయుచు పలికిన -

'ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది,
పౌరుషే చాప్రతిద్వంద్వః శరైనం జహి రావణిమ్.'

అను శపథము ఆయన భక్తికి, విశ్వాసమునకు పరమావధి. వాల్మీకి రామునిద్వారా లక్ష్మణుని దివ్యగుణములను మన కందించెను -

'స్నిగ్ధో ధర్మరతో వీరః సతతం సత్పథే స్థితః,
ప్రియః ప్రాణసమో వశ్యో భ్రాతా చాపి సఖా చ మే.'

లక్ష్మణుడు రామునకు సహచరుడై చరించినట్లు, శత్రుఘ్నుడు భరతునకు ఆయన ధర్మానుష్ఠానములో సహాయపడెను.

ఏ మహాపురుషునకైన తన ధర్మానుష్ఠానమున తన సహచరులు సహకరించవలెను. లేకున్న ధర్మనిరతి కుంటుపడును. ఈ శతాబ్దములో

60 సంవత్సరములు పైబడ్డ ప్రతివారికి తెలిసిన అనుభవ మొకటి కలదు. మన జాతీయోద్యమములో గాంధితో సన్నిహితుడైన ప్రతివ్యక్తి గొప్పనాయకుడుగా వెలుగొంది ఉద్యమమున తోడ్పడెను. అట్లు తమ సహచరులను తీర్చిదిద్దుట సత్పురుషుల లక్షణము.

ఇటుల రాముడు తన ధర్మాచరణము వల్ల జగద్గురువుగా వెలుగొందెను. ఆయన కళ్యాణగుణముల స్మరణము, మననము సర్వమానవులను సన్మార్గవర్తులను చేయును. అది ఈ మహాకావ్యపఠనమువల్లనే కలుగును.

## విభూతి

ఇపుడు ఈ మహాకావ్యము యొక్క విభూతి కొంత పరిశీలింతము. ఎందువల్లననగా 'బీజాద్భూతిర్విశిష్యతే" అను వేదవ్యాసవచనము. అనగా కారణము కన్నా అనుభవము విశిష్టమైనది. ఈ శతాబ్దములో హేతువాదమునకు ప్రాముఖ్యము నిచ్చు మహనీయులు కూడా దీనిని అంగీకరించిరి. క్రీ. శ. 1899 లో రేషనలిస్ట్ ప్రెస్ అసోషియేషన్ వారు లండన్‌లో రేషనలిజమునకు నిర్వచనము తెలియజేయు తీర్మానములో "హేతువాదులు కూడా మానవుని అనుభవములో తమ నిర్ణయమును పరిచూచుకొనవలయునని ఆదేశించిరి. అందుచే ఈ మహాకావ్యమును గురించి మన జాతి అనుభవమును తెలియుట అవసరము.

కేంద్ర సాహిత్య అకాడమి వారు రామాయణమునకు ఒక సూచికను తయారు చేసిరి. అందు మొదటి సంపుటము ప్రకారము వివిధ రామాయణముల సంఖ్య నలుబది. వాల్మీకి రామాయణముపై వ్యాఖ్యానములు 73. అనువాదములు 348. దేశభాషలందు రామాయణములు 730. రామాయణముపై సాహిత్య గ్రంథములు 608. నాటక గ్రంథములు 647. ఇక స్తోత్రములు, పాటలు, భజనలు, గీతములు 1732. రెండవసంపుటములో మిగతా వివరములు తెలుపబడును. ఈ మహాకావ్యము గురించి పండితులు, విద్వాంసులు, విమర్శకారులు వారి అభిప్రాయమును తెలియజేసిరి. బాలకాండలో, యుద్ధకాండలో వీటిని పొందుపరచితిమి. ప్రస్తుతము అరవిందయోగి, వివేకానందుడు, వింటర్ నిడ్స్, జెల్లికోటు అభిప్రాయములను పరికింతము.

అరవిందయోగి : మహాకవి దాంతే కవితకు ముగ్ధులమగుదుము. హోమరుకవి విరచిత ఇలియడ్ పఠనమున పరితృప్తుల మగుదుము. పాశ్చాత్యసాహిత్యమునందు వా రసమానులు. కాని కావ్యశిల్పమున వాల్మీకియే సర్వశ్రేష్ఠుడు. రామాయణమును పోలిన మహాకావ్యము పృథ్విలో మరొకటి లేదు.

స్వామి వివేకానంద : రామాయణము, మహాభారతము మన జాతి సంస్కృతికి సారస్వతమునకు మూలకందము. ఆ ఉన్నతాశయములను మానవుడెల్లపుడూ అనుసరించి ఆచరించుటకు ప్రయత్నించవలసి యున్నది.

వింటర్ నిడ్స్ : రామాయణము భారతీయుల సర్వసంపదగా విలసిల్లు చున్నది. ప్రపంచమున గల ఏ సారస్వతమునందునూ, యుగయుగములుగా కవితను, భావమును మరే గ్రంథము ఇట్లు ప్రసరింపచేయలేదు.

యం. జెర్లీ కోట్ : హోమర్ రచించిన ఇలియడ్ రామాయణమునకు ప్రతిధ్వని మాత్రమే. రామాయణముయొక్క దుర్బలస్మారకము. అద్దాని అనుక రణము విస్పష్టము. ఈయది నిరాకరింప వీలులేనిది. అల్పవిషయములందును అట్టి అనుకరణమును గాంతుము.

కావున మనము ఇందలి కథాభాగమును, శిల్పమును, నీతిని, ధర్మమును, తత్త్వమును స్థూలముగా పరిశీలింతము. అందుపై దాని అనుభూతి తేటతెల్లమగును.

ముందు ఇతివృత్తము : రామాయణము ఆదికావ్యము. ఇది మనదేశమునందు మాత్రమేకాక మానవజాతికే ఆదికావ్యము. వాల్మీకి ఆదికవి. ఇది చాలా పురాతనమైన గ్రంథము. రామకథ మన దేశస్థులకే కాక ఇతర దేశస్థులకు కూడా సుపరిచితము. ఈ కథ వలన ఉత్తేజపడి ఈ కథనే తిరిగి వేలకొలది కవులు పండితులు అనేకరకములైన సాహితీప్రక్రియలను వెలయించిరి. దీనికి కారణమేమని ప్రశ్నించిన 'రాముని బోలు ధీరోదాత్తనాయకుడు మాకు మరియొకడు కనబడుటలేదు. కావున ఈ కథనే తిరిగి వెలయించుటకు రాముని కళ్యాణగుణముల దోషము కారణము కాని మా దోషము కాదని' మురారి అను సంస్కృతకవి తెలిపెను. సంస్కృతములోనే కాక అన్ని దేశభాషలలో రామకథ వెలిసినది. సంస్కృతకవులలో పేర్కొనవలసినవారు మహాకవి కాళిదాసు, భవభూతి, భాసుడు, భోజుడు, భట్టి మొదలగు కవిపరంపర. దేశభాషలలో కంబరామాయణము, తులసీదాసు రచించిన 'రామచరితమానసము' ప్రఖ్యాతములు. తెలుగులో రంగనాథరామాయణము 1240 లో వ్రాయబడినది. తెలుగులోనే మొత్తము 150కి పైగా రామాయణములు కలవు. ఇతరదేశములలో ముఖ్యముగా నేపాలు, మంగోలియా, బర్మా మరియు అన్ని సౌత్ ఈస్ట్ ఆసియా దేశములలో రామకథ అనేక మార్పు చేర్పులతో ప్రచురింపబడినది. జైనులు, బౌద్ధులు ఈ కథను చిత్రవిచిత్రముగా అనుకరించిరి. అష్టాదశపురాణములలో మహాభారతములో ఈ కథ ఉపాఖ్యానముగా కూర్చబడినది. ఈ కథను నాటకముగా, జోలపాటగా, బుఱ్ఱ కథగా, శిల్పములలో చిత్తరువులుగా వెలయించిరి. రవివర్మ కోదండరామచిత్రము

జగద్విఖ్యాతము. అనేక వాగ్గేయకారులు రామకథను కీర్తించిరి. అందు త్యాగరాజు లోకోత్తముడు. ఆసేతుహిమాచలము అత్యధికులకు ఇది నిత్యపారాయణగ్రంథము. దుఃఖసమయములందు శాంతిని సమకూర్చు గ్రంథముగా ప్రజలకు దీనిపై ప్రగాఢవిశ్వాసము కలదు. రామాయణములో ప్రతిమాట ఒక మంత్రముగా భావించి, ఉపాసనాపూర్వకముగా దీనిని ధరించు మహనీయులు కోకొల్లలు. ఈ గ్రంథముపై అనేక వ్యాఖ్యానగ్రంథములు వెలసినవి. దేశవ్యాప్తముగా వేలకు వేలు రామాలయములు కలవు. ప్రతిసంవత్సరము శ్రీరామనవమి కళ్యాణ మహోత్సవమును దేశవ్యాప్తముగా చేయుదురు. తెలుగుదేశములో ప్రతి తల్లి తన బిడ్డలకు శ్రీరామరక్షగా ఆశీస్సు లందచేయును. తెలుగువారు వ్రాత కుపక్రమించునపుడు శ్రీరామ అని ప్రప్రథమమున వ్రాయు ఆచారము స్థిరముగా నెలకొన్నది.

ఇక శిల్పము : 'పాఠ్యే గేయే చ మధురం' అని ఇందు సాహిత్యము, సంగీతము అనువుగా వుండి నవరసభరితముగా విలసిల్లిన మహాకావ్యము. ఇందు దివ్యమైన శిల్పము కలదు. నగరవర్ణన, ఋతువర్ణన, సంభాషణాచాతుర్యము, యుద్ధవర్ణనము, భూగోళవర్ణన, నిషిద్ధధర్మములు, రాజధర్మములు, సర్వకాలము లందు మానవుడు అనుష్ఠించవలసిన నీతిమార్గము, ధర్మోత్కర్ష, దివ్యముగా నెలకొని యున్నవి. వాస్తవికతకు అతిసన్నిహితమగు అలంకారములు, ఉపమాన ఉపమేయములు రసమయముగా వెలువరించబడెను. కొన్ని రసగుళికలు కాదు అమృతగుళికలు.

సాహిత్యము :

| | | | | |
|---|---|---|---|---|
| 1. ఛాయేవానుగతా సదా | : బాలకాండ. | 73-27 | పు. | 825 |
| 2. చర్మణా హృతచేతనా | : అరణ్య. | 43-8 | పు. | 520 |
| 3. స్త్రియం పురుషవిగ్రహం | : అయో. | 30-3 | పు. | 491 |
| 4. అమృతం విషసంసృష్టం | : సుందర. | 37-2 | పు. | 609 |
| 5. వచనం మరణోపమం | : అయో. | 19-1 | పు. | 324 |
| 6. గిరిర్దీప్త ఇవాగ్నినా | : అరణ్య. | 52-15 | పు. | 652 |
| 7. రహితాం చంద్రసూర్యాభ్యాం సంధ్యామివ | : అరణ్య. | 41-3 | పు. | 563 |
| 8. ప్రాధీతా ఇవ పర్వతాః | : కిష్కిం. | 18-10 | పు. | 345 |

నీతి :

1. సులభాః పురుషా రాజన్

సతతం ప్రియవాదినః : అరణ్య. 37-2 పు. 53

2. నందత్యుదిత ఆదిత్యే
నందత్యస్తమితే రవే : యుద్ధ. 105-25 పు. 650

3. మృదుర్హి పరిభూయతే : అయో. 21-11 పు. 363

4. న సుఖాల్లభ్యతే సుఖమ్ : అరణ్య. 9-31 పు. 100

5. న చాతిప్రణయ కార్యః కర్తవ్యోऽ
ప్రణయశ్చ తే : కిష్కింధా. 22-23 పు. 270

6. యస్య కోశశ్చదండశ్చ
మిత్ర్యాణ్యాత్మా చ భూమిప : కిష్కింధా. 29-11 పు. 366

7. కృతఘ్నేనాస్తి నిష్కృతిః : కిష్కింధా. 34-12 పు. 449

8. తదన్నమపి భోక్తవ్యం
జీర్యతే యదనామయం : అరణ్య. 50-17 పు. 626

## ధర్మము :

1. నృశంస మనృశంసం వా
ప్రజారక్షణకారణాత్ : బాల. 25-17 పు. 345

2. క్షమా దానం క్షమా
యజ్ఞః క్షమా సత్యం : బాల. 33-8 పు. 420

3. తపోబలాద్విశుద్ధాంగీ : బాల. 49-20 పు. 591

4. సత్యమేకపదం బ్రహ్మ
సత్యే ధర్మః ప్రతిష్ఠితః : అయో. 37-24 పు. 609

5. సత్యధర్మాభిరక్తానాం నాస్తి
మృత్యుకృతం భయమ్ : యుద్ధ. 46-33 పు. 609

6. శూరాణాం శుద్ధబావానాం
భవతామార్జవంబలం : యుద్ధ. 50-53 పు.

7. మరణాంతాని వైరాణి : యుద్ధ. 112-26 పు.

8. కార్యం కరుణమార్యేణ
న కశ్చిన్నాపరాధ్యతి : యుద్ధ. 116-44 పు.

# తత్త్వము

"రామో విగ్రహవాన్ ధర్మః" - రాముడు మూర్తీభవించిన ధర్మమను వాల్మీకివచనము రామాయణసారభూతము. ధర్మము బహుళము. కాని అన్ని ధర్మములలో సత్యము శరీరమునకు శిరస్సువలె ప్రధానము. ఈ సత్యధర్మాచరణము యథార్థభాషణము మాత్రమేకాక సమత, దయ, అహింస, క్షమ, ఆత్మనిగ్రహము మొదలగు 13 ధర్మములతో కూడిన నిశితమైన తపశ్చరణ. సత్యమునకు సారము దమము. అనగా ఇంద్రియనిగ్రహము. ఇంద్రియనిగ్రహము కలవాడే ఈ సత్యమును అనుష్ఠించగలడు. శ్రీరాముడు ఇంద్రియనిగ్రహము కలిగి సత్యసంధుడు, సత్యవాది, సత్యశీలుడు, సత్యపరాక్రముడు, సత్యవ్రతుడు అని ఖ్యాతి నొందెను. ఈ సత్యధర్మమును ఈ లోకమున తాను అభ్యసించి, ఆ అనుష్ఠానమార్గమును సుప్రతిష్ఠితము చేసెను.

ప్రతిమానవుడు తన జీవితాంతము ఈ సత్యవ్రతధారణమే ధ్యేయముగా కలిగియుండవలయును. అందుచేతనే మన జాతిపిత గాంధీజీ తన జీవిత చరితమును Experiment with truth సత్యమందు పరీక్ష అని పేర్కొనెను.

ఈ మహాకావ్యపఠనమువలన మనకు సత్యధర్మముల యెడల గౌరవము, విశ్వాసము, వాటిని అనుష్ఠించవలయునని తీవ్రమైన అభిలాష కలుగును.

ధర్మ మనగా కర్మాచరణము. రాముడు సర్వమానవధర్మములను తాను స్వయముగా అనుష్ఠించి మార్గదర్శిగా వెలుగొందెను. బుద్ధుడు, క్రైస్తు వలె, సర్వసంగపరిత్యాగి అయిన పరివ్రాజకుడు కాడు. గృహస్థుడు. వివాహితుడై, తన శీలము, వృత్తమువలన గౌరవము, మర్యాదను సంపాదించి, తల్లిదండ్రులు, సోదరులు, ధర్మపత్ని, గురువులు, పెద్దలు, పౌరుల యెడ భక్తి, ప్రేమ, వాత్సల్యములను జూపి గొప్ప కీర్తి సంపాదించెను. ఈ కీర్తికి ఆయన బలపరాక్రమములు ఏ మాత్రము కారణములు కావు. ఆయన అనుసరించిన ఈ పై ధర్మము ఈ దేశములో ఆచారముగా నిలబడినది: అందుచే ఈ దేశస్థులు దానిని సులువుగా అవలంబించవచ్చును. పైగా 'ఆచారప్రభవో ధర్మః' అను సూక్తి ఈ ధర్మాచరణకు తోడ్పడును. కావున ఈ పై ధర్మాచరణయందు ప్రతిసామాన్యవ్యక్తి, ఆయనను ఆదర్శపురుషునిగా స్వీకరించి అనుసరించదగును.

రాముడు ఒక పౌరుడే కాక సుదీర్ఘకాలము పరిపాలన చేసిన చక్రవర్తి. ప్రజలకు పరిపాలనాదక్షత గల రాజుయొక్క ఆవశ్యకత, నిషిద్ధధర్మములు, రాజనీతి, అయోధ్యాకాండ 67, 75, 100, సర్గలలో వరుసగా సుదీర్ఘముగా

వివరించబడినవి. రాజధర్మము సామాన్యమానవధర్మము కన్న భిన్నముగా, ఒక్కొక్కసారి విపరీతముగా కూడా నుండును. ఈ విషయము శ్రీరాముడు విశ్వామిత్రునిచే నుపదేశము పొంది దానిని శిరసావహించెను. తాటక స్త్రీ కదా! ఆమెను చంపనగునా యని సంశయించునపుడు విశ్వామిత్రుడు -

"నృశంస మనృశంసం వా ప్రజారక్షణకారణాత్,
పాతకం వా సదోషం వా కర్తవ్యం రక్షతా సతా" బాల. 25 - 17

ధర్మాత్ముడైన రాజు ప్రజారక్షణకొరకై ఉపయోగించు కార్యము క్రూరమైనను, కాకపోయినను, పాపమైనను దోషముతో కూడినదైననూ చేయదగినదే అని రామునకు సూచించెను.

భవభూతి మహాకవి తన ఉత్తరరామచరితనాటకములో ఈ పై శ్లోకమునకు నిజమైన వ్యాఖ్యాన మనదగు ఈ క్రింది వాక్యమును రామునిచే ప్రతిజ్ఞాపూర్వకముగా పలికించెను.

"స్నేహం దయాం చ సౌఖ్యం చ యది వా జానకీమపి,
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా"

లోకారాధనకొరకు స్నేహమును, దయను, సౌఖ్యమును, అవసరమైనచో జానకిని కూడా త్యాగము చేసెదనని తెలిపి అట్లు చేసిన లోకోత్తరవీరుడు శ్రీరాముడు. రాజ్యపాలనయందు ఈ సూత్రము సార్వకాలీనమైన ధర్మము. రాజు తన సుఖమును ఆశించరాదు. తన సన్నిహితుల యెడ ఏమాత్రమైన స్నేహమును కాని, పక్షపాతమును కాని చూపరాదు. ధర్మమునందు ఎంత ప్రసన్నత చూపునో అధర్మము యెడ అంత కరకుదనమును చూపవలయును. కావుననే భవభూతి ధర్మనిష్ఠుల హృదయములను "వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి" అని పేర్కొనెను.

వ్యక్తిగతధర్మము రాజునకు రాజ్యపాలనలో వర్తించదు. బౌద్ధమతము స్వీకరించిన అశోకుడు కళింగయుద్ధానంతరము సైన్యమును రద్దు చేసినందున దేశమునకు తీరని దుర్దశ కలిగెను.

Resist not evil - చెడును నిరోధించవద్దు అని బైబిలులో చెప్పిన ధర్మమును అనుసరించుటకు వీలులేదని 'రసెల్' మహనీయుడు అభిప్రాయపడెను. కావున రాజధర్మము అసిధారావ్రతము.

ప్రజారాజ్యములో ప్రతిపౌరుడు రాజుతో సమానుడు. తాను ధర్మనిరతి కలవాడై, అధర్మమును ఎదుర్కొనుటకు తగిన శక్తిసామర్థ్యములు కలిగి యుండవలయును. మన జాతీయనాయకుడైన లాలాలజపతిరాయ్ యొక్క

ధర్మనిరతిని, అధర్మనిరోధమును ప్రజలు వర్ణించుచు ఆయనను Half Wax-Half Steel 'సగము లక్క - సగము ఉక్కు' అని ప్రశంసించిరి.

శ్రీరాముడు జననీజనకులతో బాటు జన్మభూమిని కూడా ప్రేమించి గౌరవించి 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అని పలికి ప్రజలను ఉత్తేజపరచిన మహవీయుడు. ఇచట 'రామో రాజ్య ముపాసిత్వా' యను వాల్మీకివాక్యము గమనార్హము. రాజును కదా యని అహంకారము లేక భయభక్తులతో అప్రమత్తుడై రాజ్యపరిపాలనే తనకు ఉపాసనాదైవముగా పరిగణించెను. కావున వ్యక్తిగతధర్మములే కాక రాజ్యపాలనయందలి పవిత్రమైన ధర్మములు కూడా ఈ మహాకావ్యపఠనమువలన మనకు అలవడును.

"రామాయణము వేదమని రాముడు అవతారపురుషు" డని అందురు. అందుచే ఇది మతగ్రంథ మని, ఈ యువతరమువారు కొందరు ఈ గ్రంథము యెడల వారి వైముఖ్యమును తెలుపుదురు.

కొందరు దీనిని మతగ్రంథముగా పరిగణించినంతమాత్రమున దీనిని నిరసించుట ఉచితము కాదు. రామాయణము వేదతుల్యమని పండితులు అంగీకరింతురు. దానికి ఆధారము సర్వధర్మములకు మూలమైన వేదసారము సత్యము, సత్యసారము దమము, దమసారము మోక్షమని భారతవచనము. రాముడు వేదములకు సారమైన సత్యమును సుప్రతిష్ఠితమును చేసెను. రామాయణ మనగా రాముడు పయనించిన మార్గము. అదియే సత్యపథము. అందుచే రామాయణము వేదతుల్యమనుట అంగీకారసూచకమే.

ఇక అవతారవిషయము. దేవత లందరు నీవు సాక్షాత్తు విష్ణువని చెప్పినను రాముడు నేను దశరథుని కుమారుడను, మానవునిగా తలుచుచున్నాను, నాకంతవరకే తెలియునని చెప్పెను. ఎపుడు కాని ఏ విధమైన అద్భుతశక్తులను ప్రకటించలేదు. సామాన్యమానవుని వలె సుఖదుఃఖములను సహించుచు సత్యధర్మపరాయణుడని సంపాదించిన జగద్విఖ్యాతమైన కీర్తి కొన్నివేల సంవత్సరములు గడిచిననూ నవనవోన్మేషముగా ఈనాటికీ వర్ధిల్లుచున్నది. ఇకముందు కూడా ఈ చరిత్రప్రభావము మానవాళిపై తప్పక యుండునని తోచును. దీనికి కారణము ప్రజల మూఢనమ్మక మనిన, హేతువాదమునకే భంగము. ఎందుకనిన నిజమైన హేతువులను గ్రహింపలేక పోయినందున.

ఈ ఆత్మ - అనగా చైతన్యస్వరూపమగు మహాసముద్రములో మన మందరము అవతారపురుషులమే. కాని మన మా సముద్రములో తుంపురులు, బుడగలు, నురుగులు వంటివారము. శ్రీరాముడు, బుద్ధుడు, క్రైస్తు మొదలగు

మహనీయులు మహోతరంగములు. బుడగలతో పోల్చిన కెరటములు చాలా గొప్పవనుట నిర్వివాదాంశము. బుడగలను పోలు మానవులు కెరటములను బోలు మహనీయులను అవతారపురుషులని భావించుట సహజము. హేతువాది, తోటి మావవుడైన రాముడు అవతారపురుషు డను భావనను నిరసించినను, ఆ భావనకు కారణము రాముని ధర్మనిరతి యని అంగీకరించక తప్పదు. అవతారము నిజముకానీ అబద్ధముకానీ, భ్రమకానీ, ప్రమాదముకానీ, రాముడు ధర్మానుష్ఠానమునకు అవధి. అందుచే రాముడు ధర్మానుష్ఠానావతారము అనరాదా? 'విద్ధి మాం ఋషిభిస్తుల్యం కేవలం ధర్మ మాశ్రితమ్' - నేను ఋషితుల్యుడను. కేవలము ధర్మమును అనుష్ఠింతునని ప్రకటించి, తన జీవితాంతము ఆ ధర్మమును ఆచరించి చూపెను. అందు జగద్గురువుగా విలసిల్లెను. కావున ఆయన అవతారపురుషుడౌనా కాదా అను విషయము అనవసరము. చర్చనీయాంశము కారాదు. ఆయన చూపిన ధర్మమార్గమును అనుసరించుటకు ప్రయత్నించుటయే మన కర్తవ్యము.

ఈ ధర్మానుష్ఠానముయెడల మానవు డెంత శ్రద్ధ చూపించవలయునో తెలిపిన వేదవ్యాసవచనము గమనార్హము. భారతము చివర సారాంశమైన వాక్యముగా చెప్పుచు వేదవ్యాసమహర్షి "ఉర్ధ్వబాహుర్విరౌమ్యేష" రెండు చేతులు పైకెత్తి చెప్పుచున్నానని, "న జాతు కామాన్న భయాన్న లోభాత్ ధర్మం త్యజేత్ జీవితస్యాపి హేతోః" - కామము చేతకాని భయమున కాని, లోభముచేత, ప్రాణరక్షణనిమిత్తమున కాని ధర్మమును విడువరాదని ప్రకటించెను. ఈ ధర్మము సర్వకాలీనము. మతవిషయమున, రాజకీయవిశ్వాసమునందు కూడా దీనిని ఉల్లంఘించరాదు. ఉదాహరణకు సామ్రాజ్యవిధానమునకు, పెట్టుబడిదారీ విధానమునకు కోరలు పీకి మానవాళికి ఎంతో మేలు చేకూర్చిన కమ్యూనిస్టు వ్యవస్థ ఈ నాడు నిర్వీర్యమై, కుప్పకూలిపోయినది. దీనికి కారణము ఆ వ్యవస్థలోని నేతలు ఆ ధర్మమును ఉల్లంఘించిరి. కమ్యూనిస్టు వ్యవస్థ క్రింద రాజ్యాంగము నడుపు రొమీనియా దేశ పరిపాలకుడు, తన గదికి బంగారపు పూత పూయించెను. కమ్యూనిజమునకు మాతృస్థానమగు రష్యాలో ప్రజలందరికి లాభదాయకమైన కమ్యూనిటీఫారములో ఏ ఒక్క వ్యక్తియూ పూర్తివిశ్వాసముతో పని చేయలేదు. కావున మానవుడు అభ్యుదయముకొరకు ధర్మము నుల్లంఘించకూడదు. ధర్మముతో సాధించిన అభ్యుదయమే సుఖశాంతులను సమకూర్చును. అధర్మముతో సాధించిన అభివృద్ధి పతనమునకు దారితీయును. ఈ మహాకావ్యమున రావణుడు సాధించని అభ్యుదయము లేదు. సిరి, సంపద, వీర్యము, పరాక్రమము, తేజస్సు, తపస్సులతో తనకు మించినవాడు లేడనిపించుకొనెను. వీటిలో రావణుడు రాముని కే మాత్రము తీసిపోడు. కాని సత్యధర్మములు కుంటుపడినందున దుర్గతిపాలాయెను. నీచమైన స్త్రీ

చౌర్యమును చేసెను. రాముని తల కల్పించి అతడు మరణించెనని ఘోరమైన అసత్యమాడి సీతను వశపరచుకొనజూచెను. వ్యక్తికానీ, వ్యవస్థకానీ, సత్యధర్మములను అతిక్రమించిన వారిని దుర్దశ తప్పక వరించును. ముందు సంపాదించిన సంపద ఏటిపాలగును. అందుచే ధర్మానుష్ఠానము ప్రతిమానవునకు శిరోధార్యము.

ఈ మహాకావ్యము మనదేశ సంస్కృతి, సంప్రదాయము, ముఖ్యముగా ఆర్షధర్మమునకు పట్టుకొమ్మగా విలసిల్లుచున్నది. కావున ఈ దేశమునందలి ప్రతివ్యక్తి దానిని అధ్యయనము చేసి కృతకృత్యుడు కాగలడని ఈ ఆర్షసంస్థవారి అభిలాష, ప్రార్థన.[1]

జస్టిస్ పమిడిఘంటం కోదండరామయ్య
ఆంధ్రప్రదేశ్ హైకోర్టు మాజీ న్యాయమూర్తి

---

ఈ. మహాకావ్యమును ఆధ్యాత్మికదృష్టితో వ్యాఖ్యానించిన గ్రంథములు :
1. రామరహస్యోపనిషత్తు
2. రామతాపనీయోపనిషత్తు
3. సీతోపనిషత్తు
4. అధ్యాత్మరామాయణము
5. సీతారామాంజనేయసంవాదము
6. తులసీదాసరామాయణము
7. కంబరామాయణము

మొదలగునవి.



శ్రీరామచంద్ర పట్టాభిషేకము

శ్రీః

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః

బాలానందినీసహిత మగు

# శ్రీమద్రామాయణము - యుద్ధకాండము

## అథ ప్రథమః సర్గః

[శ్రీరాముడు హనుమంతుని ప్రశంసించి ఆతనిని కౌగలించుకొనుట. సముద్రమును దాటుట ఎట్లా అని ఆలోచించుట.]

మూ. శ్రుత్వా హనుమతో వాక్యం యథావదభిభాషితమ్,
రామః ప్రీతిసమాయుక్తో వాక్యముత్తరమబ్రవీత్. 1

ప్ర. అ. రామః=రాముడు, యథావత్=ఉన్నదున్నట్లుగా, అభిభాషితమ్=పలకబడిన, హనుమతః=హనుమంతునియొక్క, వాక్యమ్=వాక్యమును, శ్రుత్వా=విని, ప్రీతిసమాయుక్తః=ఆనందముతో కూడినవాడై, ఉత్తరమ్=ప్రత్యుత్తరరూపమైన, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. హనుమంతుడు ఉన్నదున్నట్లుగా చెప్పుచు పలికిన మాటలు విని, రాముడు సంతోషించుచు ఇట్లు పలికెను. 1

మూ. కృతం హనుమతా కార్యం సుమహద్భువి దుర్లభమ్,
మనసాపి యదన్యేన న శక్యం ధరణీతలే. 2

ప్ర. అ. హనుమతా=హనుమంతునిచేత, యత్=ఏది, ధరణీతలే=భూతలమునందు, అన్యేన=ఇతరునిచేత, మనసాపి=మనస్సుచేత గూడ, న శక్యమ్=శక్యము కాదో అట్టి, సుమహత్ =చాల గొప్పదైన, భువి=భూలోకమునందు, దుర్లభమ్=దుర్లభమైన, కార్యమ్=కార్యము, కృతమ్=చేయబడినది.

తా. ఈ భూలోకములోని ఇతరు లెవ్వరూ మనస్సుచేత కూడ చేయజాలని భూమియందు దుర్లభమైన గొప్ప కార్యమును హనుమంతుడు చేసినాడు. 2

మూ. న హి తం పరిపశ్యామి యస్తరేత మహోదధిమ్,
అన్యత్ర గరుడాద్వాయోరన్యత్ర చ హనూమతః. 3

ప్ర. అ. గరుడాత్=గరుత్మంతునికంటె, వాయోః=వాయువుకంటె, అన్యత్ర=వేరుగా, హనూమతః=హనుమంతుని కంటె, అన్యత్ర=వేరుగా, యః=ఎవడు, మహోదధిమ్=మహాసముద్రమును, తరేత=దాటునో, తమ్=అట్టి వానిని, న పరిపశ్యామి హి=చూడను కదా!

తా. గరుత్మంతుడు, వాయువు, ఈ హనుమంతుడు తప్ప సముద్రమును దాటగలిగినవా రెవ్వరూ మరొకరు నాకు కనబడుటలేదు. 3

మూ. దేవదానవయక్షాణాం గన్ధర్వోరగరక్షసామ్,
అప్రధృష్యాం పురీం లఙ్కాం రావణేన సురక్షితామ్, 4
ప్రవిష్టః సత్త్వమాశ్రిత్య జీవన్కో నామ నిష్క్రమేత్.

ప్ర. అ. దేవదానవయక్షాణామ్=దేవతలకు, దానవులకు, యక్షులకు, గన్ధర్వోరగరక్షసామ్=గంధర్వులకు, ఉరగులకు, రాక్షసులకు, అప్రధృష్యామ్=ఎదిరింప శక్యము కానిది, రావణేన=రావణునిచేత, సురక్షితామ్=బాగుగా రక్షింపబడినది అయిన, లఙ్కాం పురీమ్=లంకాపురమును, సత్త్వమ్=బలమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, ప్రవిష్టః= ప్రవేశించినవాడై, కో నామ=ఎవడు, జీవన్=జీవించుచున్నవాడై, నిష్క్రమేత్=తిరిగివచ్చును?

తా. దేవ - దానవ - యక్ష - గంధర్వ - ఉరగ - రాక్షసులలో ఎవ్వరూ కూడ ఎదిరింపరాని, రావణపాలితమైన లంకలో కేవలము తన బలముతో ప్రవేశించి ఎవడైనా ప్రాణాలతో తిరిగిరాగలడా? 4

మూ. కో విశేత్సుదురాధర్షాం రాక్షసైశ్చ సురక్షితామ్, 5
యో వీర్యబలసంపన్నో న సమః స్యాద్ధనూమతః.

ప్ర. అ. యః=ఎవడు, వీర్యబలసంపన్నః=పరాక్రమముతోను బలము తోను కూడినవాడై, .హనూమతః=హనుమంతునితో, సమః=సమానుడు, న స్యాత్=కాకుండునో, అట్టి, కః=ఎవడు, సుదురాధర్షామ్=మిక్కిలి ఎదిరింప శక్యము కానిది, రాక్షసైః=రాక్షసులచేత, సురక్షితామ్=బాగుగా రక్షింపబడినది అయిన లంకను, విశేత్=ప్రవేశించును ?

తా. ఎదిరింప శక్యము కానిది, రాక్షసులచేత బాగుగా రక్షింపబడు చున్నదీ అయిన లంకలోనికి, వీర్యబలముతో సంపన్నుడై, హనుమంతునితో సమానుడైనవాడు తప్ప మరెవ్వడు ప్రవేశింపగలడు? 5

మూ. భృత్యకార్యం హనుమతా సుగ్రీవస్య కృతం మహత్, 6
ఏవం విధాయ స్వబలం సదృశం విక్రమస్య చ.

ప్ర. అః హనుమతా=హనుమంతునిచేత, విక్రమస్య=పరాక్రమమునకు, సదృశమ్ =సమానమైన, స్వబలమ్= తన బలమును, విధాయ=చేసి(చూపి), సుగ్రీవస్య=సుగ్రీవునకు, మహత్=గొప్ప, భృత్యకార్యమ్=భృత్యుని కార్యము, కృతమ్=చేయబడినది.

తా. హనుమంతుడు పరాక్రమమునకు తగిన తన బలమును ప్రదర్శించి, సుగ్రీవునకు భృత్యుడు చేయవలసిన గొప్ప కార్యమును సాధించిపెట్టినాడు.6

మూ. యో హి భృత్యో నియుక్తః సన్ భర్త్రా కర్మణి దుష్కరే, 7
కుర్యాత్తదనురాగేణ తమాహుః పురుషోత్తమమ్.

ప్ర. అ. యః=ఏ, భృత్యః=భృత్యుడు, దుష్కరే=చేయ శక్యము కాని, కర్మణి =పనియందు, భర్త్రా= ప్రభువుచేత, నియుక్తః సన్=నియమింపబడినవాడై, తత్=ఆ పనిని, అనురాగేణ=ఆసక్తితో, కుర్యాత్=చేయునో, తమ్=ఆతనిని, పురుషోత్తమమ్=పురుషులలో శ్రేష్ఠునిగా, ఆహుః=చెప్పుదురు.

తా. చేయుటకు చాల కష్టమైన పని చేయుటకు ప్రభువు నియమించగా ఆ పనిని ఆసక్తితో చేయు భృత్యుడు పురుషులలో శ్రేష్ఠుడు అని చెప్పుదురు.7

మూ. యో నియుక్తః పరం కార్యం న కుర్యాన్నృపతేః ప్రియమ్, 8
భృత్యో యుక్తః సమర్థశ్చ తమాహుర్మధ్యమం నరమ్.

ప్ర. అ. యః=ఏ, భృత్యః=భృత్యుడు, యుక్తః=బుద్ధియుక్తుడై, సమర్థః చ= సమర్థుడై ఉండి కూడ, నియుక్తః=నియోగింపబడినవాడై, నృపతేః=రాజునకు, ప్రియమ్=ఇష్టమైన, కార్యమ్=కార్యమును, పరమ్= అధికముగా, న కుర్యాత్=చేయడో, తమ్=వానిని, మధ్యమం నరమ్=మధ్యముడైన నరునిగా, ఆహుః=చెప్పుదురు.

తా. బుద్ధిమంతుడై యుండి, సమర్థుడై ఉండి కూడ ఏ భృత్యుడు రాజుకు ప్రియమైన పనిని చెప్పినదానికంటె అధికము చేయడో ఆతడు మధ్యముడైన నరు డని చెప్పుదురు. 8

మూ. నియుక్తో నృపతేః కార్యం న కుర్యాద్యః సమాహితః, 9
భృత్యో యుక్తః సమర్థశ్చ తమాహుః పురుషాధమమ్.

ప్ర. అ. నియుక్తః=నియోగించబడిన, యః=ఏ, భృత్యః=భృత్యుడు, యుక్తః=బుద్ధియుక్తుడైనను, సమర్థశ్చ=సమర్థుడైనను, నృపతేః=రాజుయొక్క, కార్యమ్=కార్యమును, సమాహితః=సావధానచిత్తుడై, న కుర్యాత్=చేయడో, తమ్=వానిని, పురుషాధమమ్=పురుషులలో అధమునిగా, ఆహుః=చెప్పుదురు.

తా. ఒక కార్యమునందు నియుక్తుడైన భృత్యుడు, బుద్ధిమంతుడై ఉండి, సమర్థుడై ఉండి కూడ ప్రభువు కార్యమును శ్రద్ధగా చేయకపోయినచో వాడు పురుషులలో అధముడు అని చెప్పుదురు. 9

మూ. తన్నియోగే నియుక్తేన కృతం కృత్యం హనూమతా, 10
న చాత్మా లఘుతాం నీతః సుగ్రీవశ్చాపి తోషితః.

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, నియోగే=కార్యమునందు, నియుక్తేన=నియమింపబడిన, హనూమతా=హనుమంతునిచేత, కృత్యమ్=కార్యము, కృతమ్=చేయబడినది. ఆత్మా=తాను, లఘుతామ్=లఘుత్వమును, న నీతః=పొందించబడలేదు. సుగ్రీవశ్చాపి=సుగ్రీవుడు కూడ, తోషితః=సంతోషపెట్టబడినాడు.

తా. కార్యమును చేయుటకై నియుక్తుడైన హనుమంతుడు ఆ పనిని సాధించినాడు. తనను ఏ మాత్రము తేలికపరచుకొనలేదు. సుగ్రీవునకు సంతోషము కలిగించినాడు. 10

మూ. అహం చ రఘువంశశ్చ లక్ష్మణశ్చ మహాబలః, 11
వైదేహ్యా దర్శనేనాద్య ధర్మతః పరిరక్షితాః.

ప్ర. అ. వైదేహ్యాః=సీతయొక్క, దర్శనేన=దర్శనముచేత, అద్య=ఇప్పుడు, అహం చ=నేను, రఘువంశశ్చ= రఘువంశము, మహాబలః=గొప్పబలము గల, లక్ష్మణశ్చ=లక్ష్మణుడు, ధర్మతః =ధర్మానుసారముగా, పరిరక్షితాః=రక్షింపబడినాము.

తా. హనుమంతు డిప్పుడు సీతను చూచి వచ్చి నన్ను, రఘువంశమును, మహాబలుడైన లక్ష్మణుని ధర్మానుసారము రక్షించినాడు. 11

మూ. ఇదం తు మమ దీనస్య మనో భూయః ప్రకర్షతి, 12
యదిహాస్య ప్రియాఖ్యాతుర్న కుర్మి సదృశం ప్రియమ్.

ప్ర. అ. తు=కాని, ప్రియాఖ్యాతుః=ప్రియమైన వార్తను చెప్పిన, అస్య=ఈతనికి, సదృశమ్=తగిన, ప్రియమ్=ప్రియమును, యత్ న కుర్మి=నేను చేయుటలేదు అనునది ఏది కలదో, ఇదమ్=ఇది, దీనస్య=దీనుడనైన, మమ=నాయొక్క, మనః=మనస్సును, భూయః=అధికముగా, ప్రకర్షతి=లాగుచున్నది.

తా. కాని నేను, ప్రియవార్తను చెప్పిన ఈతనికి తగు ప్రియమును చేయజాలకున్నాను. అదియే దీనుడ నైన నా మనస్సును చాల పీడించుచున్నది.

మూ. ఏష సర్వస్వభూతస్తు పరిష్వఙ్గో హనూమతః, 13
మయా కాలమిమం ప్రాప్య దత్తస్తస్య మహాత్మనః.

ప్ర. అ. మయా=నాచేత, ఇమమ్=ఈ, కాలమ్=కాలమును, ప్రాప్య=పొంది, మహాత్మనః=మహాత్ముడైన, తస్య=అట్టి, హనూమతః=హనుమంతునకు, సర్వస్వభూతః=నా సర్వస్వమైన, ఏషః పరిష్వఙ్గః=ఈ ఆలింగనము, దత్తః=ఇవ్వబడినది.

తా. అట్టి మహాత్ముడైన హనుమంతునకు, ఈ సమయమునందు నేను నా సర్వస్వమైన ఆలింగనమును ఇచ్చుచున్నాను. 13

మూ. ఇత్యుక్త్వా ప్రీతిహృష్టాఙ్గో రామస్తం పరిషస్వజే, 14
హనుమన్తం కృతాత్మానం కృతవాక్యముపాగతమ్.

ప్ర. అ. రామః=రాముదు, ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, ప్రీతిహృష్టాఙ్గః=సంతోషముతో వికసించిన శరీరము కలవాడై, కృతాత్మానమ్=వినీతమైన (అదుపులో ఉంచుకొనబడిన) బుద్ధి గలవాడు, కృతవాక్యమ్=చేయబడిన వాక్యము (ఆజ్ఞ) కలవాడు అయిన, ఉపాగతమ్=వచ్చిన, తం హనూమన్తమ్=ఆ హనుమంతుని, పరిషస్వజే=కౌగలించుకొనెను.

తా. రాము డిట్లు పలికి, సంతోషముతో శరీరము పులకించగా, వినయముతో కూడిన బుద్ధి గల తన కార్యమును పూర్తిచేసి వచ్చిన హనుమంతుని కౌగలించుకొనెను. 14

మూ. ధ్యాత్వా పునరువాచేదం వచనం రఘుసత్తమః, 15
హరీణామీశ్వరస్యాపి సుగ్రీవస్యోపశృణ్వతః.

ప్ర. అ. రఘుసత్తమః=రాముదు, ధ్యాత్వా=ఆలోచించి, హరీణామ్=వానరులయొక్క, ఈశ్వరస్య=ప్రభువైన, సుగ్రీవస్య=సుగ్రీవుడు, ఉపశృణ్వతః=వినుచుండగా, పునః=మరల, ఇదం వచనమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. రాముడు కొంచెము సేపు ఏదో ఆలోచించి, వానరప్రభువైన సుగ్రీవుడు వినుచుండగా మరల ఇట్లు పలికెను. 15

మూ. సర్వథా సుకృతం తావత్సీతాయాః పరిమార్గణమ్, 16
సాగరం తు సమాసాద్య పునర్నష్టం మనో మమ.

ప్ర. అ. సీతాయాః=సీతయొక్క, పరిమార్గణమ్=అన్వేషణము, సర్వథా=అన్ని విధముల, సుకృతమ్=బాగుగా చేయబడినది. తు=కాని, సాగరమ్=సముద్రమును, సమాసాద్య=చేరి, మమ మనః=నా మనస్సు,

పునః=మరల, నష్టమ్=నష్టమైనది.

తా. మీరు అన్ని విధాలా సీతాన్వేషణమును చక్కగా చేసినారు. కాని నా మనస్సు సముద్రము స్మృతికి రాగానే ఏమి చేయవలెనో తోచకుండ అయిపోవుచున్నది. 16

మూ. కథం నామ సముద్రస్య దుష్పారస్య మహామ్భసః, 17
హరయో దక్షిణం పారం గమిష్యన్తి సమాగతాః.

ప్ర. అ. సమాగతాః=కలిసి ఉన్న, హరయః=వానరులు, దుష్పారస్య=దాటశక్యము కానిది, మహామ్భసః=గొప్ప జలము గలది అయిన, సముద్రస్య=సముద్రముయొక్క, దక్షిణమ్=దక్షిణపుదైన, పారమ్=ఒడ్డును, కథమ్=ఎట్లు, గమిష్యన్తి=పొందగలరో ?

తా. ఈ వానరులందరూ కలిసి అధికమైన జలముతో అగాధమై దాటశక్యము కాని సముద్రము దక్షిణతీరమును ఎట్లు చేరగలరో! 17

మూ. యద్యప్యేష తు వృత్తాన్తో వైదేహ్యా గదితో మమ, 18
సముద్రపారగమనే హరీణాం కిమిహోత్తరమ్.

ప్ర. అ. వైదేహ్యా=సీతయొక్క, ఏషః=ఈ, వృత్తాన్తః=వృత్తాంతము, మమ=నాకు, గదితో యద్యపి=చెప్పబడినదైనను, హరీణామ్=వానరులయొక్క, సముద్రపారగమనే=సముద్రమును దాటుటయందు, ఉత్తరమ్= ఉత్తరము, కిమ్=ఏమి ?

తా. నాకు సీతావృత్తాంతము తెలిసినది. అది బాగుగానే ఉన్నది కాని ఈ సముద్రమును వానరు లెట్లు దాటగలరు అనుదానికి సమాధానమేమి ?18

మూ. ఇత్యుక్త్వా శోకసంభ్రాన్తో రామః శత్రునిబర్హణః, 19
హనూమన్తం మహాబాహుస్తతో ధ్యానముపాగమత్.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ప్రథమః సర్గః

ప్ర. అ. శత్రునిబర్హణః=శత్రుసంహారకుడు, మహాబాహుః=గొప్ప బాహువులు గలవాడు అయిన, రామః=రాముడు, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, శోకసంభ్రాన్తః= శోకముచేత భ్రాంతి చెందినవాడై, తతః=అటుపిమ్మట, ధ్యానమ్=ధ్యానమును, ఉపాగమత్=పొందెను.

తా. శత్రుసంహారకుడు, మహాబాహువు అయిన రాముడు హనుమంతునితో ఇట్లు పలికి శోకాక్రాంతుడై ఆలోచించసాగెను. 19

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో మొదటిసర్గ సమాప్తము.

# అథ ద్వితీయః సర్గః

[సుగ్రీవుడు శోకసంతప్తుడైన రామునకు ధైర్యము చెప్పుట.]

మూ. తం తు శోకపరిద్యూనం రామం దశరథాత్మజమ్,
ఉవాచ వచనం శ్రీమాన్ సుగ్రీవః శోకనాశనమ్. 1

ప్ర. అ. శ్రీమాన్=శ్రీమంతుడైన, సుగ్రీవః=సుగ్రీవుడు, శోకపరిద్యూనమ్=శోకముచేత సంతప్తుడైన, దశరథాత్మజమ్=దశరథకుమారుడైన, తమ్=ఆ, రామమ్=రామునిగూర్చి, శోకనాశనమ్=దుఃఖమును నశింపచేయు, వచనమ్=వచనమును, ఉవాచ=పలికెను.

తా. దశరథకుమారుడైన రాముడు ఆ విధముగా దుఃఖించుచుండగా శ్రీమంతుడైన సుగ్రీవుడు ఆతనితో శోకమును తొలగించు ఈ వచనము పలికెను. 1

మూ. కిం త్వయా తప్యతే వీర యథాన్యః ప్రాకృతస్తథా,
మైవం భూస్త్యజ సంతాపం కృతఘ్న ఇవ సౌహృదమ్. 2

ప్ర. అ. వీర=వీరుడా, అన్యః=ఇతరుడైన, ప్రాకృతః=సాధారణపురుషుడు, యథా=ఎట్లో, తథా=అట్లు, త్వయా=నీచేత, కిమ్=ఎందువలన, తప్యతే=దుఃఖించుట చేయబడుచున్నది ? ఏవమ్= ఇట్లు, మా భూః= అవకుము. కృతఘ్నః=కృతఘ్నుడు, సౌహృదమ్ ఇవ=స్నేహమును వలె, సంతాపమ్=తాపమును, త్యజ=విడువుము.

తా. వీరుడా ! సాధారణమానవుడు వలె ఇట్లు దుఃఖించుచున్నావేమి ? నీవు ఈ విధముగా ఉండగూడదు. కృతఘ్నుడు స్నేహమును విడిచినట్లు నీ శోకమును విడిచిపెట్టుము. 2

మూ. సంతాపస్య చ తే స్థానం న హి పశ్యామి రాఘవ,
ప్రవృత్తావుపలబ్ధాయాం జ్ఞాతే చ నిలయే రిపోః. 3

ప్ర. అ. రాఘవ=రామా ! ప్రవృత్తౌ=(సీత) వృత్తాంతము, ఉపలబ్ధాయామ్= పొందబడిన దగుచుండగా, తే=నీయొక్క, సంతాపస్య=దుఃఖమునకు, స్థానమ్=అవకాశమును, న పశ్యామి హి=చూడను కదా !

తా. రామా ! సీత వార్త తెలిసినది. శత్రువు ఎక్కడ ఉన్నాడో కూడ తెలిసినది. అందుచేత ఇంక నీవు దుఃఖించుటకు కారణ మేమీ నాకు కనబడుటలేదు. 3

మూ. మతిమాన్ శాస్త్రవిత్ప్రాజ్ఞః పణ్డితశ్చాపి రాఘవ,
త్యజేమాం ప్రాకృతాం బుద్ధిం కృతాత్మేవార్థదూషణీమ్. 4

ప్ర. అ. రాఘవ=రామా! మతిమాన్=బుద్ధిమంతుడవు, శాస్త్రవిత్=శాస్త్రముల నెరిగినవాడవు,ప్రాజ్ఞః=ఆలోచనాశక్తి గలవాడవు, పణ్డితశ్చ=నిర్ణయము చేయ సమర్థుడవు, అపి=అయిఉన్నావు. కృతాత్మా=నిగ్రహించుకొనబడిన బుద్ధి గలవాడు, అర్థదూషణీమ్=కార్యవిఘాతమును కలిగించు, బుద్ధిమ్ ఇవ=బుద్ధిని వలె, ఇమామ్=ఈ, ప్రాకృతామ్=సామాన్యమైన, బుద్ధిమ్=బుద్ధిని, త్యజ= విడువుము.

తా. రామా ! నీవు బుద్ధిమంతుడవు. శాస్త్రము తెలిసినవాడవు. ఆలోచనాశక్తి కలవాడవు. తగు నిర్ణయములు చేయగలవాడవు. అందుచేత బుద్ధిమంతుడు కార్యవిఘాతకమైన ఆలోచనలు విడచినట్లు ఈ సామాన్యపు ఆలోచనలను విడిచిపెట్టుము. 4

మూ. సముద్రం లఙ్ఘయిత్వా తు మహానక్రసమాకులమ్,
లఙ్కామారోహయిష్యామో హనిష్యామశ్చ తే రిపుమ్. 5

ప్ర. అ. మహానక్రసమాకులమ్=గొప్ప మొసళ్లతో వ్యాకులమైన, సముద్రమ్= సముద్రమును, లఙ్ఘయిత్వా=దాటి, లఙ్కామ్=లంకను, ఆరోహయిష్యామః= ఎక్కెదము. తే=నీయొక్క, రిపుమ్=శత్రువును, హనిష్యామశ్చ=చంపెదము.

తా. పెద్ద మొసళ్లతో నిండి ఉన్న సముద్రము దాటి లంకలో ప్రవేశించెదము. నీ శత్రువును సంహరించెదము. 5

మూ. నిరుత్సాహస్య దీనస్య శోకపర్యాకులాత్మనః,
సర్వార్థా వ్యవసీదన్తి వ్యసనం చాధిగచ్ఛతి. 6

ప్ర. అ. నిరుత్సాహస్య=ఉత్సాహము లేనివాడు, దీనస్య=దీనుడు, శోకపర్యాకులాత్మనః=శోకముచేత వ్యాకులమైన బుద్ధి కలవాడు అయిన పురుషునియొక్క, సర్వార్థాః=అన్ని కార్యములు, వ్యవసీదన్తి=నశించును. వ్యసనం చ=ఆపదను కూడ, అధిగచ్ఛతి=పొందును.

తా. ఉత్సాహము లేక శోకముచేత బుద్ధి వ్యాకులమై, దీనుడుగా ఉన్న పురుషుని కార్యము లన్నీ చెడిపోవును. అతడు కష్టాల పాలగును. 6

మూ. ఇమే శూరాః సమర్థాశ్చ సర్వతో హరియూథపాః,
త్వత్ప్రియార్థం కృతోత్సాహాః ప్రవేష్టుమపి పావకమ్, 7
ఏషాం హర్షేణ జానామి తర్కశ్చాపి దృఢో మమ.

ప్ర. అ. సర్వతః=నలువైపులందు ఉన్న, ఇమే=ఈ, హరియూథపాః= వానరసేనానాయకులు, శూరాః=శూరులు, సమర్థాశ్చ=సమర్థులు. త్వత్ప్రియా ర్థమ్=నీ ప్రియముకొరకు, పావకమ్=అగ్నిని, ప్రవేష్టుమ్ అపి= ప్రవేశించుటకు కూడ, కృతోత్సాహాః=చేయబడిన ఉత్సాహము కలవారు. ఏషామ్=వీరియొక్క, హర్షేణ=సంతోషముచేత, జానామి=తెలిసికొనుచున్నాను. మమ=నాయొక్క, తర్కశ్చాపి=ఊహకూడ, దృఢః=దృఢమైనది.

తా. మన చుట్టూ నిలచి ఉన్న ఈ వానరనాయకు లందరూ శూరులు, సమర్థులు. నీకు ప్రియమును చేయుటకై అగ్నిలో దుముకుటకు కూడ ఉత్సాహవంతులై ఉన్నారు. నే నీ విషయమును వీరి సంతోషమును బట్టి తెలుసుకొనుచున్నాను. నా కీ విషయమున పూర్తి నమ్మక మున్నది. 7

మూ. విక్రమేణ సమానేష్యే సీతాం హత్వా యథా రిపుమ్, 8
రావణం పాపకర్మాణం తథా త్వం కర్తుమర్హసి.

ప్ర. అ. రిపుమ్=శత్రువు, పాపకర్మాణమ్=పాపకర్మ గలవాడు అయిన, రావణమ్=రావణుని, విక్రమేణ=పరాక్రమముచేత, హత్వా=చంపి, సీతామ్=సీతను, యథా=ఎట్లు, సమానేష్యే=తీసికొని రాగలనో, తథా=అట్లు, త్వమ్=నీవు, కర్తుమ్= చేయుటకు, అర్హసి=తగి ఉన్నావు.

తా. శత్రువు, పాపకర్మలు ఆచరించువాడు అయిన రావణుని పరాక్రమముచేత చంపి, సీతను, నేను తీసికొనివచ్చుటకు తగిన ఉపాయమును ఆలోచించుము. 8

మూ. సేతురత్ర యథా బద్ధ్యేద్యథా పశ్యేమ తాం పురీమ్, 9
తస్య రాక్షసరాజస్య తథా త్వం కురు రాఘవ.

ప్ర. అ. రాఘవ=రామా ! అత్ర=ఇక్కడ (సముద్రమునందు,) సేతుః=సేతువు, యథా=ఎట్లు, బధ్యేత్=కట్టబడునో, తస్య=ఆ, రాక్షస రాజస్య=రాక్షసరాజుయొక్క, తామ్=ఆ, పురీమ్=పట్టణమును, యథా=ఎట్లు పశ్యేమ=చూచెదమో, తథా=అట్లు, త్వమ్=నీవు, కురు=చేయుము.

తా. రామా ! సముద్రముపై సేతువు కట్టి రాక్షసరాజైన ఆ రావణుని నగరమైన లంకను మనము చేరు ఉపాయము ఆలోచించుము.9

మూ. దృష్ట్వా తాం హి పురీం లఙ్కాం త్రికూటశిఖరే స్థితామ్, 10
హతం చ రావణం యుద్ధే దర్శనాదవధారయ.

ప్ర. అ. త్రికూటశిఖరే=త్రికూటపర్వతశిఖరమునందు, స్థితామ్= ఉన్న, తామ్= ఆ, లఙ్కాం పురీమ్=లంకాపట్టణమును, దృష్ట్వా=చూచి,

యుద్ధే=యుద్ధమునందు, దర్శనాత్=దర్శనమువలననే, రావణమ్=రావణుని, హతమ్=చంపబడినవానినిగా, అవధారయ=నిశ్చయించుము.

తా. మనము త్రికూటపర్వతశిఖరము మీద ఉన్న లంకాపురమును చూచిన పిమ్మట యుద్ధములో రావణుడు మన కంటపడిన వెంటనే అతడు మరణించగల డని నమ్ముము. 10

మూ. అబద్ధ్వా సాగరే సేతుం ఘోరే చ వరుణాలయే, 11
లఙ్కా న మర్దితుం శక్యా సేన్ద్రైరపి సురాసురైః.

ప్ర. అ. ఘోరే=భయంకరమైన, వరుణాలయే=వరుణుని నివాసమైన, సాగరే= సముద్రమునందు, సేతుమ్=సేతువును, అబద్ధ్వా=కట్టకుండగా, లఙ్కా=లంక, సేన్ద్రైః=ఇంద్రునితోకూడిన, సురాసురైః అపి=సురాసురుల చేత కూడ, మర్దితుమ్= పీడించుటకు, న శక్యా=శక్యమైనది కాదు.

తా. భయంకరము, వరుణుని నివాసస్థానమూ అయిన సాగరమునందు సేతువును బంధించకుండగా ఇంద్రసహితులైన సురాసురులు కూడ లంకను పీడింపజాలరు. 11

మూ. సేతుర్బద్ధః సముద్రే చ యావల్లఙ్కాసమీపతః, 12
సర్వం తీర్ణం చ మే సైన్యం జితమిత్యుపధారయ.
ఇమే హి సమరే వీరా హరయః కామరూపిణః. 13

ప్ర. అ. లఙ్కాసమీపతః=లంక సమీపమునందు, సముద్రే=సముద్రమునందు, యావత్=ఎంతలో, సేతుః=సేతువు, బద్ధః=కట్టబడినదో, మే=నాయొక్క, సర్వం సైన్యమ్=సమస్తమైన సైన్యము, తీర్ణమ్=దాటినదో, అంతలో, జితమ్ ఇతి=మనచే జయించబడినది అని, ఉపధారయ=నిర్ణయించుము. కామరూపిణః=స్వేచ్ఛారూపముగల, ఇమే=ఈ, హరయః=వానరులు, సమరే=యుద్ధమునందు, వీరాః హి=వీరులు.

తా. లంకాసమీపమునందు సముద్రముమీద సేతువును బంధించి నా సైన్యము అంతా దాటిన వెంటనే మనము జయించితి మనియే నమ్ముము. ఇచ్ఛానుసారము రూపములను ధరించ గలిగిన ఈ వానరులు యుద్ధములో వీరులు. 12,13

మూ. తదలం విక్లబాం బుద్ధిం రాజన్ సర్వార్థనాశనీమ్,
పురుషస్య హి లోకేఽస్మిన్ శోకః శౌర్యాపకర్షణః. 14

ప్ర. అ. రాజన్=రాజా ! తత్=ఆ కారణమువలన, సర్వార్థనాశనీమ్=సక

లకార్యములను నశింపచేయు, విక్లబామ్=వ్యాకులమైన, బుద్ధిమ్=బుద్ధిని వహించి, అలమ్=చాలును. అస్మిన్=ఈ, లోకే=లోకమునందు, పురుషస్య=పురుషునకు, శోకః=శోకము, శౌర్యాపకర్షణః=శౌర్యమును తగ్గించివేయునది.

తా. రాజా ! అందుచే సకలకార్యములను నశింపచేయు మనోవ్యాకులత్వమును విడిచిపెట్టుము. ఈ లోకములో శోకము మానవుని శౌర్యమును తగ్గించివేయును. 14

మూ. యత్తు కార్యం మనుష్యేణ శౌణ్డీర్యమవలమ్బ్యతామ్,
తదలంకరణాయైవ కర్తుర్భవతి సత్వరమ్. 15

ప్ర. అ. మనుష్యేణ=మనుష్యునిచేత, యత్=ఏ, శౌణ్డీర్యమ్=శూరత్వము, కార్యం తు=చేయదగినదో, అది, అవలమ్బ్యతామ్=అవలంబింపబడుగాక. తత్=అది, సత్వరమ్=శీఘ్రముగా, కర్తుః=కర్తకు, అలంకరణాయైవ=అలంకారము (కార్యసాధనము) కొరకే, భవతి=అగును.

తా. మనుష్యుడు చూపవలసిన శౌర్యమును అవలంబించుము. అది, దానిని చూపువానికి తప్పక కార్యసాధకము అగును. 15

మూ. అస్మిన్ కాలే మహాప్రాజ్ఞ సత్త్వమాతిష్ఠ తేజసా,
శూరాణాం హి మనుష్యాణాం త్వద్విధానాం మహాత్మనామ్,
వినష్టే వా ప్రనష్టే వా శోకః సర్వార్థనాశనః.

ప్ర. అ. మహాప్రాజ్ఞ=గొప్ప బుద్ధి కలవాడా ! అస్మిన్=ఈ, కాలే=కాలమునందు, తేజసా=తేజస్సుతో, సత్త్వమ్=బలమును, ఆతిష్ఠ=అవలంబించుము. శూరాణామ్= శూరులు, మహాత్మనామ్=మహాత్ములు అయిన, త్వద్విధానామ్=నీవంటి, మనుష్యాణామ్= మనుష్యులకు, వినష్టే వా=కనబడకుండపోయినపుడు, ప్రనష్టే వా=నశించినప్పుడు, శోకః= శోకము, సర్వార్థనాశనః=సకలప్రయోజనములను నశింపచేయునది.

తా. మహాబుద్ధిశాలి వైన ఓ ! రామా ! ఈ సమయమునందు తేజస్సుతో బలమును చూపుము. ఎవరైన కనబడకుండ పోయినపుడు గాని, నశించి నప్పుడు గాని నీవంటి శూరులు, మహాత్ములు అయిన పురుషులు శోకము చెందుట సకలకార్యములను నశింపచేయును. 16

మూ. తత్త్వం బుద్ధిమతాం శ్రేష్ఠః సర్వశాస్త్రార్థకోవిదః, 17
మద్విధైః సచివైః సార్థమరిం జేతుం సమర్హసి.

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, బుద్ధిమతామ్=బుద్ధిమంతులలో,

శ్రేష్ఠః=శ్రేష్ఠుడవు, సర్వశాస్త్రార్థకోవిదః=సమస్తమైన శాస్త్రవిషయములను ఎగిరినవాడవు అయిన, త్వమ్=నీవు, మద్విధైః=నావంటి, సచివైః సార్థమ్=సహాయులతో కూడినవాడవై, అరిమ్=శత్రువును, జేతుమ్=జయించుటకు, సమర్థో౽సి=తగి ఉన్నావు.

తా. నీవు బుద్ధిమంతులలో శ్రేష్ఠుడవు. సమస్తమైన శాస్త్రవిషయములు తెలిసినవాడవు. అందుచేత నీవు నావంటి సహాయులతో కలిసి శత్రువును జయించుము. 17

మూ. న హి పశ్యామ్యహం కం చిత్త్రిషు లోకేషు రాఘవ, 18
గృహీతధనుషో యస్తే తిష్ఠేదభిముఖో రణే.

ప్ర. అ. రాఘవ=రామా ! రణే=యుద్ధమునందు, గృహీత ధనుషః=ధరింపబడిన ధనస్సు గల, తే=నీయొక్క, అభిముఖే=అభిముఖమునందు, యః=ఎవడు, తిష్ఠేత్=నిలబడునో అట్టి, కం చిత్=ఎవనినీ, త్రిషు=మూడు, లోకేషు=లోకములయందు, అహమ్=నేను, న పశ్యామి హి=చూడనుకదా !

తా. రామా ! నీవు యుద్ధరంగములో ధనస్సు ధరించి ఉండగా నీకు ఎదురుగా నిలబడగలవాడు ఎవ్వడూ నాకు ఈ మూడు లోకములలో కూడ కనబడుటలేదు. 18

మూ. వానరేషు సమాసక్తం న తే కార్యం విపత్స్యతే, 19
అచిరాద్ద్రక్ష్యసే సీతాం తీర్త్వా సాగరమక్షయమ్.

ప్ర. అ. వానరేషు=వానరులయందు, సమాసక్తమ్=సంబంధించి ఉన్న, తే కార్యమ్=నీ కార్యము, న విపత్స్యతే=విపత్తును పొందదు. అక్షయమ్=అంతము లేని, సాగరమ్= సముద్రమును, తీర్త్వా=దాటి, అచిరాత్=అచిరకాలములో, సీతామ్=సీతను, ద్రక్ష్యసే=చూడగలవు.

తా. వానరులు చేయవలసి ఉన్న నీ కార్యము ఎన్నటికినీ చెడదు. నీవు అచిరకాలములో అపారమైన సముద్రమును దాటి సీతను చూడగలవు.19

మూ. తదలం శోకమాలమ్బ్య క్రోధమాలమ్బ భూపతే, 20
నిశ్చేష్టాః క్షత్రియా మన్దాః సర్వే చణ్డస్య బిభ్యతి.

ప్ర. అ. భూపతే=రాజా ! తత్=ఆ కారణమువలన, శోకమ్=శోకమును, ఆలమ్బ్య=అవలంబించి, అలమ్=చాలును. క్రోధమ్=క్రోధమును, ఆలమ్బ= అవలంబించుము. నిశ్చేష్టాః=ప్రయత్నములేని, క్షత్రియాః=క్షత్రియులు, మన్దాః= మందులు. చణ్డస్య=తీక్ష్ణమైనవానికి, సర్వే=అందరూ, బిభ్యతి=భయపడుదురు.

తా. అందుచేత, ఓ ! రాజా ! శోకమును అవలంబించకుము. శత్రువుమీద క్రోధమును చూపుము. ప్రయత్నవిహీనులైన క్షత్రియులు మందులు. శూరుడై కోపమును చూపువానికి అందరూ భయపడుచుందురు. 20

మూ. లఙ్ఘనార్థం చ ఘోరస్య సముద్రస్య నదీపతేః, 21
సహాస్మాభిరిహోపేతః సూక్ష్మబుద్ధిర్విచారయ.

ప్ర. అ. సూక్ష్మబుద్ధిః=సూక్ష్మబుద్ధి గల నీవు, ఇహ=ఇప్పుడు, అస్మాభిః సహ= మాతో కూడ, ఉపేతః=కూడినవాడవై, నదీపతేః=నదుల ప్రభువైన, ఘోరస్య=భయంకరమైన, సముద్రస్య=సముద్రముయొక్క, లఙ్ఘనార్థమ్=లంఘనము కొరకు, విచారయ= ఆలోచించుము.

తా. సూక్ష్మబుద్ధి గల నీవు ఇప్పుడు, నదులకు ప్రభువైన, భయంకరమైన సముద్రమును ఎట్లు దాటవలెనో మా అందరితో కలిసి ఆలోచించుము. 21

మూ. లఙ్ఘితే తత్ర తైః సైన్యైర్జితమిత్యేవ నిశ్చిను, 22
సర్వం తీర్ణం చ మే సైన్యం జితమిత్యవధార్యతామ్.

ప్ర. అ. తైః=ఆ, సైన్యైః=సైన్యములచేత, తత్ర=ఆ సముద్రము, లఙ్ఘితే=లంఘించబడిన దగుచుండగా, జితమిత్యేవ=జయించబడినదే (జయించుటయే) అని, నిశ్చిను=నిశ్చయించుము. మే=నాయొక్క, సర్వమ్=సమస్తమైన, సైన్యమ్=సైన్యము, తీర్ణమ్=దాటినచో, జితమితి=జయించుట అని, అవధార్యతామ్=నిశ్చయించబడుగాక.

తా. సైన్యములు ఆ సముద్రమును దాటినచో మనకు జయము వచ్చినదని నిశ్చయించుము. నా సైన్య మంతా సముద్రమును దాటినా జయము లభించిన దని నిస్సంశయముగా చెప్పవచ్చును. 22

మూ. ఇమే హి హరయః శూరాః సమరే కామరూపిణః, 23
తానరీన్విధమిష్యన్తి శిలాపాదపవృష్టిభిః.

ప్ర. అ. సమరే=యుద్ధమునందు, శూరాః=శూరులు, కామరూపిణః=స్వేచ్ఛానుసారము రూపములు ధరించువారు అయిన, ఇమే హరయః=ఈ వానరులు, శిలాపాదపవృష్టిభిః= శిలలయొక్క, వృక్షములయొక్క వర్షములచే, తాన్=ఆ, అరీన్=శత్రువులను, విధమిష్యన్తి హి=నశింపచేయగలరు కదా !

తా. ఈ వానరులందరు ఇష్టానుసారము రూపములు ధరించగలవారు. యుద్ధమునందు శూరులు. వీరు శిలలను, వృక్షములను వర్షించి శత్రువులను నశింపచేయగలరు. 23

మూ. కథం చిత్పరిపశ్యామి లఙ్ఘితం వరుణాలయమ్, 24
హతమిత్యేవ తం మన్యే యుద్ధే శత్రునిబర్హణ.

ప్ర. అ. శత్రునిబర్హణ=శత్రువులను నశింపచేయు ఓ ! రామా! వరుణాలయమ్= సముద్రమును, కథంచిత్=ఎటులనో, లఙ్ఘితమ్=దాటబడినదానినిగా, పరిపశ్యామి= చూచుచున్నాను. యుద్ధే=యుద్ధమునందు, తం=ఆ రావణుని, హతమిత్యేవ= చంపబడినవానినిగానే, మన్యే=తలచెదను.

తా. ఓ ! శత్రుసంహారకుడా ! ఏదో విధముగ సముద్రమును దాటివేయుగలమని, యుద్ధమునందు రావణుడు చంపబడు ననీ ఊహించుచున్నాను.

మూ. కిముక్త్వా బహుధా చాపి సర్వథా విజయీ భవాన్, 25
నిమిత్తాని చ పశ్యామి మనో మే సంప్రహృష్యతి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే యుద్ధకాణ్డే ద్వితీయః సర్గః.

ప్ర. అ. బహుధా=అనేకవిధములుగా, ఉక్త్వా=చెప్పి, కిమ్=ఏమి ప్రయోజనము ? సర్వథా=అన్నివిధముల, భవాన్=నీవు, విజయీ=విజయము కలవాడవు. నిమిత్తాని=మంచి నిమిత్తములను (శకునములను) కూడ, పశ్యామి=చూచుచున్నాను. మే=నాయొక్క, మనః=మనస్సు, సంప్రహృష్యతి=సంతోషించుచున్నది.

తా. ఇంక చాల మాటలు చెప్పనేల ? అన్నివిధములా నీకు విజయము లభించును. నాకు మంచి శకునములు కనబడుచున్నవి. నా మనస్సు ఉత్సాహభరితమై ఉన్నది. 25

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు యుద్ధకాండలో ద్వితీయసర్గ సమాప్తము.

# అథ తృతీయః సర్గః

[సుగ్రీవుని మాటలు వినిన పిమ్మట రాముడు లంకను గూర్చి సవివరముగా చెప్పు మని హనుమంతుని అడుగుట; ఆతడు చెప్పుట.]

మూ. సుగ్రీవస్య వచః శ్రుత్వా హేతుమత్పరమార్థవత్,
ప్రతిజగ్రాహ కాకుత్ స్థో హనూమన్తమథాబ్రవీత్. 1

ప్ర. అ. కాకుత్ స్థః=రాముడు, సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క, హేతుమత్=హేతువులు కలది, పరమార్థవత్=గొప్ప అర్థము కలది అయిన, వచః=వచనమును, శ్రుత్వా=విని, ప్రతిజగ్రాహ=స్వీకరించెను. అథ=అటు పిమ్మట, హనూమన్తమ్=హనుమంతుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. సుగ్రీవుడు పలికిన యుక్తియుక్తములైన మంచి అర్థము గల మాటలు విని రాముడు నీవు చెప్పినది నిజమే అని అంగీకరించెను. పిమ్మట హనుమంతునితో ఇట్లు పలికెను. 1

మూ. తపసా సేతుబన్ధేన సాగరోచ్ఛోషణేన చ,
సర్వథాపి సమర్థోఽస్మి సాగరస్యాస్య లఙ్ఘనే. 2

ప్ర. అ. తపసా=తపస్సుచేతను, సేతుబన్ధేన=సేతుబంధముచేతను, సాగరోచ్ఛోషణేన చ=సముద్రమును ఎండించుటచేతను, సర్వథాపి=అన్ని విధముల, అస్య సాగరస్య=ఈ సముద్రముయొక్క, లఙ్ఘనే=లంఘనమునందు, సమర్థః=సమర్థుడను, అస్మి=అయి ఉన్నాను.

తా. తపస్సుచేత గాని, సేతువును నిర్మించి గాని, సముద్రమును ఎండిపోవునట్లు చేసి గాని, అన్ని విధాలా ఈ సముద్రమును దాటుటకు నేను సమర్థుడను. 2

మూ. కతి దుర్గాణి దుర్గాయా లఙ్కాయాస్తద్బ్రవీష్వ మే,
జ్ఞాతుమిచ్ఛామి తత్సర్వం దర్శనాదివ వానర. 3

ప్ర. అ. వానర=హనుమంతుడా ! దుర్గాయాః=ప్రవేశింప కష్టమైన, లఙ్కాయాః= లంకకు, కతి=ఎన్ని, దుర్గాణి=దుర్గములు ఉన్నవో, బ్రవీష్వ=చెప్పుము. తత్=దానిని, సర్వమ్=సమస్తమును, దర్శనాదివ=చూచుటవలన వలె, జ్ఞాతుమ్=తెలిసికొనుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. హనుమంతుడా ! ప్రవేశించుటకు కష్టమైన ఆ లంకాపట్టణములో ఎన్ని దుర్గములు ఉన్నవో చెప్పుము. ఆ విషయము నంతను ప్రత్యక్షముగా

